# శివలీల

(5 అంకముల నాటకము.)

గ్రంథకర్త
కవితావినోద నిడుమర్తి ఈశ్వరప్ప, బి.ఏ.
శ్రీకాకుళం.

రాజమండ్రి
లలితా ముద్రాక్షరశాల యందు
ముద్రింపబడియె.
1931.

 [వెల రు 1-[illegible]]

# శివలీల

(అయిదంకముల నాటకము)

గ్రంథకర్త:

కవితావినోద నిడమర్తి ఈశ్వరప్ప బి. ఏ.

శ్రీకాకుళము.

మొదటికూర్పు 1,000 ప్రతులు.

రాజమహేంద్రవరము,

లలితాముద్రాక్షరశాలయందుఁ

ముద్రింపఁబడెను.

1931

 [వెల రు 1—0—0

# పీఠిక.

"శివలీల,, అనునాటకము కవితావినోద నిడమర్తి ఈశ్వ రప్ప బి. ఏ. గారిచే రచింపఁబడి మూముద్రాక్షశాలలో ముద్రిత మైనది. నేనీగ్రంథకర్తగారినిఁ జాలకాలమునుండి యెఱుంగుదును. వీరికవిత్వతత్త్వము పత్రికలలో లోక మెఱింగియే యున్నది. ఉపోద్ఘాత ములో నిది ప్రథమప్రయత్న మని వీరు వ్రాసికొనినను ఈనాట కము ప్రథమప్రయత్నముగాఁ దోపదు. మిక్కిలిమనోహరముగా నున్నది. శైలి మృదుమధురము. హారవిలాసమువలె నిదియు వేర్వే రుకథలతో నైదంకములుగా విభజింపఁ బడియున్నది. నాటకము భక్తిరసభరితము. "శృంగారవీరయో రన్యతరస్య ప్రాధాన్యం,, అను నియమమును భవభూత్యాదులే నిరసించినారు. ఇది భక్తిరసప్రధా నమైనది. సిరియాళచరిత్రము చదువుచున్నప్పు డెట్టివారికిని గన్నీరు మున్నీరు కాకమానదు. మఱియుఁ దిన్ననిభక్తి భరితమైన మూాధవాక్యములు చదవి యానందింపనివా రుండ రని నానమ్మకము. వీరు నీచపాత్రములకు గ్రామ్య మువయోగించుట యొప్పంగాని వీరిగ్రామ్యము పెక్కుమంది కర్థముగాదేమో యని తలంతును. నాకిందుఁ గొన్నికొన్నిస్థలముల నర్థము దెలియు లేదు. ఆధునికు లమత మనుసరించి యిందు యుదంతధాతువులయుత్తమపురుషముకుఁ దు వర్ణం బుపయోగించిరి. అది దోషముగాఁ బరిగణింప నొప్పదు.

ఈగ్రంథము ముద్రించునప్పుడు ప్రూఫులు చూచినవాఁడను నేనే గాని కొన్నియక్షరములలో ముద్రాభ్రంశము లు పడినవి. అంధ్రములో నెంతకన్ను గలవాఁడు దిద్దిన నిట్లు పడుననుకొందును. వానికిందు శుద్ధపత్రము వ్రాయఁబడినది. చిత్తగించి పాఠకమహాశ యులు సంస్కరించుకొందురుగాక యనియు గ్రంథకర్తగారికిఁ బ్రోత్సా హముగలిగించి వారిచే మఱికొన్నినాటకములు వ్రాయించుటకుఁ దోడ్పడుదురు గాక యనియు విన్నవించుచున్నాను.

రాజమండ్రి 20-7-31

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

# ఉపోద్ఘాతము.

పాఠకమహాశయులారా!

నటరాజశేఖరుండగు శివునిలీలల నొకనాటకరూపమునఁ గూర్పఁ దలఁచి స్కాందపురాణము, బ్రహ్మోత్తరఖండము, బసవపురాణము మొదలగు శైవగ్రంథములనుండి కథల నేఱి, యంకమున కొక లీలచొప్పున నైదంకముల నీనాటకము రచించితి. నటకులవకాశము ననుసరించి యెంతయుఁ గాని వేఱు వేఱంకములఁ గాని ప్రదర్శించుట కనుకూలముగ దీని విభజించియు నతికితి నిదియే నాప్రథమప్రయత్నము గాన దోషముల మన్నించి నాయుద్యమముఁ బ్రోత్సహింపఁ బ్రార్థించువాఁడను.

శ్రీకాకుళము.
18-7-31.

ఇట్లు సుజనవిధేయుఁడు
నిడమర్తి ఈశ్వరప్ప.

# అభిప్రాయములు :

Dr. C. NarayanaRao M. A. L. T., Ph. D.,
Govt. Arts College,
ANANTAPUR.

I have gone through your "శివలీల" very carefully and found it very excellent. Your portraiture of Tinna is simply excellent. I wish you would write some more scenes of that type in such language i. e. the language exhibiting the human touch. I wish your book all success. It is so very nicely written with good taste and a fine regard for theatrical representation.

ఆంధ్రవిద్యావాచస్పతి సాహిత్యసరస్వతి విద్యావినోద కవిభూషణ, శతావధాని మ. రా. రా దోమా వేంకటస్వామిగుప్తగారు. ఆంధ్రపరిశోధకవిశ్వవిద్యాలయసభ్యులు. పండితులు. క్రిష్టియనుకాలేజి, మదరాసు మకాం విజయనగరం. 30-5-29.

ఉ. శ్రీనిడమర్తి వంశ్యుఁ డయి చెన్నలరారెడునీశ్వరాఖ్యుఁ డ
నన్యగుణాతిరేకమున నొప్పెడి శైవకథావళిన్ భువిన్
మానవలోక మెల్ల ననుమానము మాని శివాద్భుతిం గనం
గా నలువారు నాటకముగా రచియించెఁ గరంబు సొంపుగన్.

ఉ. "నాటకముల్ కవిత్వ" మనునట్టి తెలుంగు నెఱుంగనట్టిరున్
బూటకు నొందుచొప్పునను బట్టల నల్లినభంగిఁ బాత్రతన్
బాటిని లోగుపాత్రములు వ్రాసియు ముద్రణ సేయుచుండి రా
నాటకముల్ ధరిత్రి నొకనాఁటికి నేనియు మేలు సేయ, వా
పాటినిగాక, నాటకపుఁబద్ధతులన్ సరిగా నెఱింగియున్
మాట యునుం గవిత్వమును మాన్యతఁ జెందగ మేటి యాజగ
న్నాటకసూత్రధారి శివునవ్యవిలాసకథావళిన్ దగన్
నాటకరీతిఁ జేసినయనంతగుణాదరు నిన్నుఁ బేర్మి నా
హాటక శైలకార్ముకుఁ డహర్నిశముం గవితావినోదు ది
క్కూటయశోవిలాసమును గూర్చియు నేలుత మీశ్వరాఖ్యునిన్,

# పాత్రలు.

| పురుషులు. | స్త్రీలు. |
|---|---|
| ఈశ్వరుఁడు. | పార్వతి. |
| దేవేంద్రుఁడు. | రతి. |
| మన్మథుఁడు. | జయ. |
| హిమవంతుఁడు. | విజయ. |
| ఋషులు. | మేనక. |
| నారదుఁడు. | అరుంధతి. |
| చిరుతొండ శ్రేష్ఠి. | తిరువేంగనాంచి. |
| సిరియాళుఁడు. | చందనిక. |
| బాలురు. | బాలెంతరాలు. |
| చిత్రవర్మ, మంత్రి. | సీమంతిని. |
| చంద్రాంగదుఁడు. | చెలికత్తె. |
| నాగేంద్రుఁడు, మంత్రి | చిత్రరేఖ. |
| మైత్రేయమహర్షి. | శశికళ. |
| సుమేధుఁడు. | సామవతి. |
| సోమయాజి. | సోమిదమ్మ. |
| అర్జునుఁడు. | |
| కిరాతులు, ప్రమథులు. | |
| తిన్నఁడు. | |

# శుద్ధపత్రము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 43 | 10 | గడువంగ | గుడువంగ |
| 59 | 6 | ఘాతకమృగము | ఘాతుకమృగము |
| 59 | 20 | ఉత్సకత | ఉత్సుకత |
| 61 | 11 | మీాయుడు | మతాయుఁడు |
| 62 | 22 | మణులరో | మణులలో |
| 63 | 3 | స్వ్యాంతమునంగు | స్వాంతమునందు |
| 69 | 4 | కీశోరములు | కిశోరములు |
| 82 | 5 | నాయాత్త | నాయత్త |
| 91 | 22 | బ్రతిబ్రవత | బతివ్రత |
| 93 | 13 | నకటి | నంటి |
| 95 | 19 | నేతపో | నేకపో |
| [illegible] | 9 | మీారెంది | మరెంది |
| 97 | 20 | కొట్టదా | కొట్టడా |
| 104 | 14 | నీద్రించు | నిద్రించు |
| 105 | 12 | టుడియు | టడియు |
| 107 | 6 | ధనస్సు | ధనుస్సు |
| 110 | 4 | వేటేఁగడు | వేటెఁగడు |
| 110 | 9 | నాసునడగ | నానడగ |

# అంకితము.

సీ. ఏసతి యాశ్రితు లేమడిగిన నీయఁ
దగి కల్పవల్లినాఁ బొగడు వడసె
నేసుచరిత యెవ రెపుడు సేవించిన
వారికిం గొంగుబంగార మయ్యె
నేభక్తిఖనికి గౌరీశుండు ప్రీతుఁడై
సాయుజ్యపదవిని నరగ నిడియె
నేమాన్యకుం బతి యీశుఁ డంతర్బహి
ర్బనవేశ్వరుం డగుబసవరాజు
గీ. యట్టినాతల్లి లోకవిఖ్యాతగుణక
దంబ జోగ్యాదిలక్ష్మాంబ ధన్య యాపె
కంకితముఁ జేతు దీని నే నధికభక్తి
జన్మసార్థక్యకాంక్షినై సంతసమున.

నిడమర్తి ఈశ్వరప్ప.
శ్రీకాకుళము.

శ్రీరస్తు.

# శివలీల

నాంది

—

ఉ. కంతుని గెల్చి గెల్వఁబడి కాంచినభక్తులచేత నెంచి నీ
మంతిని దెల్పఁ బార్థునకు మానితపాశుపతాస్త్ర మిచ్చి జ
న్మాంతరమందుఁ దిన్నఁ డగునాతని కైక్య మొసంగువేలు ప
త్యంతముదబ్ధి దేల్చి మిము నాయువు భాగ్యము నిచ్చి ప్రోచుతన్.

నాంద్యంతమున

సూత్రధారుఁడు—మారిషా ! ఇటు లొకసారి రమ్ము.

(మారిషుఁడు ప్రవేశించును.)

మారి—బావా ! నన్నుఁ బిలిచినకారణ మేమి ?

సూత్ర—నీ వేదేని తొందరపనిలో లేవు కదా ? (నవ్వుచు) నీకుఁ బని లేదు తీఱికయు లేదు లే.

మారి—నీహాస్యమున కేమిలే. ఏక్షణమున నే నాటక మాడుమందువో యని యెల్లప్పుడుఁ బరికరముల నాయత్తపఱచుచుండు నాకుఁ దీఱిక యెట్లు ?

సూత్ర—ఇప్పుడు నే నిన్నందులకే పిలిచితి. భక్తిరసభరితం బగునాటక మొం డాడుఁ డని సభాసదు లాదేశించిరి. నీసాహాయ్యమునఁ గాని వీరికోరికఁ దీర్పఁ జాలను.

మారి—సరే. ఏనాటక మాడుదము ?

సూత్రి—గీ. ఎల్లరీతులమిగులఁ బరీక్షఁ జేసి
భక్తికి న్మెచ్చి కోరినవరము లిచ్చి
భక్తులకు ముక్తి నిడుభగవంతుఁ డొకఁడె
మనకు నా "శి వ లీ ల" సంభావ్య మిపుడు.

మారి—ఏమి బావా నీపరాకు ? ఇన్నిసారు లాడియు "శి వ లీ ల" యందువేల ? కృష్ణలీల కదా ?

సూత్రి—కాదు. కాదు. ఇది యొకక్రొత్త నాటకము.

మారి—అటులా ? ఎవరు రచించిరి ?

సూత్రి—గీ. మాన్యుఁడును బ్రిథితుఁడు మల్లమపలి మల్లి
కార్జునారాధ్య కవిశిష్యుఁ డనఁ దగునిడ
మర్తియీశ్వరప్ప రచించె మధురవణితి
రసము వర్షించు "శి వ లీ ల" యొనక మొనఁగ.

మారి—ఆకవి యిం కేనాటకముల రచించెను ?

సూత్రి—పద్యరచన కాతని కిదియే ప్రథమప్రయత్నము. "జననీ "జన్మభూమి శ్చ స్వర్గా దపి గరీయసీ" యనునట్లు కవి—

"సీ. వసతి యాశ్రితు లే మడిగిన నియ్యఁ
దగి కల్పవల్లి నాఁ బొగడు వడసె
నేసుచరిత యెవ రెపుడు సేవించిన
వారికిం గొంగుబంగార మయ్యె
నేభక్తునికి గౌరీశుండు ప్రీతుఁడై
సాయుజ్యముక్తిని సరగ నిడియె
నేమాన్యకుం బతి యీడ్యుఁ డంతర్బహి
ర్బసవేశ్వరుం డగుబసవరాజు

గీ. యట్టినాతల్లి లోకవిఖ్యాతగుణక
దంబ జోగిలక్ష్మియనెడు ధన్య యాపె

కంకితముఁ జేతు దీని నే నధికభక్తి
జన్మసార్థక్యకాంక్షినై సంతసమున.

అని చెప్పికొని మాతృదేవత కీకృతి నర్పించుకొనినాఁడు. బహుకాంధ్రగీర్వాణాంగిలేయగ్రంథపరిచయము గలవానిరచనకు లోపముండునా? భక్తిరసభరితం బయ్యు నితరరసంబు లందందు నిందుఁ బోషింపఁబడియె. తినఁ బోవుచు రుచు లడుగనేల? బాగోగులు పరిశీలింప నదస్యులే దక్షులు.

మారి—కం. సరసరచనాచణుఁడు కవి
సరసాగ్రేసరులు గరము సభ్యులు కడు నే
ర్పరులు కుశీలవులుఁ గా రస
భరితము శివలీల వస్తువా బళి బళిరే!

సభాస్తారుల నానందాబ్ధి నోల లాడింపఁ గలము. ఏలన—

గీ. వానవుసిదివ్యసభ మించి వైభవమున
నేఁటిమనసభ కన్పట్టె నిక్కముచట
నొక్కరొక్కరె గురుబుధు లిక్కడ నన
గురువులును బుధు ల్సభ్యు లెల్లరును గనుము.

(దేదీప్యమానం బగుదివ్యతేజంబు కాన్పించును)

కన్నులకు మిఱుమిట్లు గొలుపు నీదివ్యతేజం బెయ్యది?

సూత్ర—గీ. దనుజు లిడుసంకటమున దందహ్యమాను
లగుచు సురలెల్లరును మేరునగముఁ జేరి
ఘోరతప మాచరింపగ వారిఁ గావ
నుర్వి కేతెంచుశర్వుని జ్యోతి యదియ.

క్షణ మాలసించినసీశ్వరసందర్శనమ్ములభింపదు. వేగమురమ్ము.

ఇది ప్రస్తావన. (నిష్క్రమింతురు.)

—(౦)—



శ్రీ ర స్తు.

# శివలీల.

## ప్రథమాంకము పార్వతీపరిణయము.

### 1 రంగము మేరుగిరి.

(హరివిరించ్యాదిసుపర్వులెల్లరుఁ దపోనిష్ఠాగరిష్ఠులై యుండ నీశ్వరుఁడు ప్రత్యక్ష మగును.)

సురలు—దేవదేవా! మహేశా, సర్వజ్ఞా, భక్త కామదా, సజ్జనావనా, దుర్జనతూలకీలా, లోకజనకా, లోకరక్షకా, మోక్షప్రదా,త్ర్యంబకా, అష్టమూర్తీ యివె మావందనశతంబులం గైకొనుము.

ఈశ్వరుఁడు— గీ. మీర లీరీతి నన్నుఁ గూర్చి ఘోరతపము
సల్పుచున్నారు గానఁ బ్రసన్నుఁడ నయి
వరము లీ వచ్చితిని గోరి వానిఁ బడయుఁ
డహహా! యీమీతపంబు మహాద్భుతంబు.

సురలు—గీ. అఖిలలోకేశ మేము మి మ్మనవరతము
గొల్చువారమై యీరీతిఁ గ్రూరదనుజ
మర్దనమ్ముల పాలయి మ్రగ్గుచుండ
నూరకున్నావు మముఁ బ్రోవ నోరులు గలరె?

మాయానందనుం డగుశూరపద్ముండు సింహవక్త్రతారకు లను నసుజులం గూడి చెలరేగి నిఖిలజగదుపద్రవంబు సేయుచున్నాఁడు. అసురులు దేవరవరబలంబున దుర్జయులై నిర్జరుల నిర్జించి త్రిభువనకంటకులై యున్నవారు. మాయుగచాట్ల నెంతని విన్నవింతుము!

ఇంద్రుఁడు— సీ. ఈయింద్రుఁ డాదను జేంద్రునంగణముల
జలవృష్టిఁ గలయంపిఁ జల్లు నీశ

అగ్ని— ఈయగ్ని యాదానవేశుపార్శ్వమ్మునఁ
గాఁగడాఁ బట్టు చాకలి మహేశ

యముఁడు— ఈయముఁ డాయసురేశ్వరుసన్నిధి
భయముతో మెలఁగెడి భటుఁడు గిరిశ

వరుణుడు— ఈపాశి యాపలాశేశునకు నీళ్లఁ
బట్టియిచ్చెడిబెస్తవాఁడు శూలి

పవనుఁడు— గీ. పవనుఁ డనువాని కెపుడు వీవనల వీతు

కుబేరుఁడు— ధనదుఁడను విరిబోడులఁ దార్చు చుందు

సూర్యుఁడు— రవిని మందాతపముఁ గాచి మ్రగ్గిపోదు

చంద్రుఁడు— చంద్రుఁడను వానికనుసన్న సంచరింతు.

ఇంద్రుఁడు—మహాప్రభూ! మాయవస్థ దుస్సహంబును దుర్వచంబును
గటాక్షించి వేవేగ రక్షింపుఁడు రక్షింపుఁడు.

ఈశ్వ—బృందారకులారా! ఆపలలాశనులు నాయాన నిమ్మేరునగంబుం
జేరఁ జాలరు. మీర లిచ్చో మద్భక్తియుక్తులరై భయం బుడిగి
యుండుఁడు. అచిరకాలంబున శూరపద్మాదులవధార్థము గుహుం
డుదయింపఁ గలఁడు. సుఖం బగుఁ గాక!

(తిరోహితుం డగును) (జవనిక దిగును.)

---

2 రంగము. మేరుగిరిప్రాంతము.

(ఇంద్రుఁడు నారదుఁడు ప్రవేశింతురు.)

ఇంద్రుఁడు—

చ. గుహుఁ డుదయించు టెన్నఁడొ కకుప్పతిముఖ్యసుపర్వసర్వదు
స్సహపరితాపకారకనృశంసదనూజులఁ గూల్చు టెన్నఁడో
తహతహ వెట్టు శంభువరదానము సిద్ధి విలంబ మన్న దు
స్సహముహూర్తంబు గల్ప మగు సంయమిచంద్ర యుపాయమే మగున్.

మా కింతవఱకు నొనఁగూడినకార్య మేమియును లేదు. మాపాట్లు కుక్కలు నక్కలుం గూడఁ గానవు. అష్టవసువు లసురధనాగారంబులఁ గాపాడుదురు ద్వాదశాదిత్యులు దైత్యగృహమ్ముల దీపమ్ములభాతి వెలుంగుదురు. కొందఱమరులు గోగ్రాసములఁ బెఱుకుచు మీనసముదాయంబులనాపాదింపుచు నసురసంరక్షణతత్పరుం డగుదానవేశ్వరు ననుసరించుచు నహోరాత్రంబులు పరాకు లేక కైవారంబు సల్పుచు సాదరంబునఁ గొల్చుచుందురు. ఇంక శోకాతిరేకంబున విహ్వలులై దీర్ఘనిశ్వాసంబుల నోరు లాఱ లోలోనఁ గుందు బందీకృత బృందారకసుందరీబృందంబుల వెతలం దెలుపం దరంబె? కిన్నరకింపురుషగరుడ గంధర్వసిద్ధసాధ్యవిద్యాధరులా రాక్షసేశ్వరు భృత్యానుభృత్యులై వానికనుసన్న మెలఁగి వాఁకిటఁ బడిగాఁపు లుండ నెప్పటియట్లనె గాక దైత్యబాధ కవధియున్నదే? మునీంద్రా! తెరు వెయ్యది?

నార—ఆదిమధ్యాంత రహితుండును సకలలోకాధారుండును లోకాతీతుండును సంహారణకార్య దీక్షారుద్రుండును నగునజునిపరుష వాక్యంబు లాశూరాదుల కాశీర్వాదంబు లయ్యె. మాయామానుషవిగ్రహమ్ములఁ దాల్చి దైతేయుల సమయించిధర్మ సంస్థాపనంబుఁ జేసినచక్రి నిర్వక్రపరాక్రమం బగుచక్ర మొక్కపతకంబు తెరంగున దారకునికంఠసీమ నలంకరించె. దండధరునిదండంబుఁ జంభారిదంభోళియు వానియక్కునఁ దగిలి మొక్కవోయె. వరుణపాశంబు త్రుటితం బయ్యెఁ గుబేరుగద భగ్న మయ్యెఁ బవనధ్వజంబు పటహీనం బయ్యె. వే యేల? శూరభయంబున నిమ్మేరుగిరిం జేరినమన కింక నామేరుచాపుండే శరణ్యుండు. గుహోదయము దనుక నోర్చి యుండక తీఱదు. దేవేంద్రా! లోకసంచారమున నేఁ గన్పట్టినవిషయ మొక్కటి విను.

సీ. దక్షాయణీదేవి తండ్రిపై నల్గి తు
షారాద్రితనయగా జనన మందె

వటమూలమునఁ బరబ్రహ్మానుసంధాయి
యగుచుఁ జిన్ముద్రచే నభవుఁ డలరె
సనకాదియోగులు స్వస్వరూపజ్ఞాన
సమ్మోదపారవశ్యమ్ముఁ గనిరి
నిఖిలజంతుశ్రేణి నిష్కామవృత్తిమై
నిష్ఠఁ దపమ్ముల నెఱపుచుండెఁ
గామతంత్రంబు లనునవి కల్ల లయ్యెఁ
బంచశరపుష్పములుక్కులపన లడంగె
లోకమున స్త్రీపురుషసంధి లుప్త మయ్యెఁ
బ్రకృతిపురుషులు వేర్వేర వఱలుకతన.

చరాచరప్రపంచంబునకు మాతృభాగం బివ్వాడు హైమవతిగా హిమవన్నగంబున కుద్భవించెఁ బితృభాగంబు విరక్తంబై దక్షిణామూర్తిగా వీరాసనంబున నొడిసె. అయ్యిరువురం గలిపిన లోకారిష్టం బడంచు కుమారుం డుదయించును. అక్కుమారకుండు రక్కసిమూకలకు మారకుం డగును. మహేశు సుమాసక్తచిత్తుం జేయఁ గుసుమాయుధుం బ్రోత్సహింపుము. తదుభయసమావేశానుకూలసన్నాహంబుఁ గావించి వచ్చితి. హైమవతి యనుదిన మీశ్వరునికిఁ బూజాద్రవ్యముల సమకూర్చి సేవించునటుల జేసితి. వాసవా! నీసన్నాహమున నీ వుండుము నేఁ బోయివచ్చెద.

ఇంద్రు—మునీంద్రా! మీయుపకృతికిఁ గృతజ్ఞులము. (నమస్కరించును)

నారద—(నిష్క్రమించును)

ఇంద్రు—(తనలో) ఇది భాగ్యోదయము సూచించును. మదనుఁ డింకను రాకున్నవాఁడు! ఎట్టికార్యతత్పరుండై యున్నాఁడో!

(రతిమన్మథులు ప్రవేశింతురు)

మన్మ—దేవేంద్రా! నమస్కారము నన్నుఁ దలంచినవని యేమి?
అ దెట్టిదైన నెరవేర్చి నీయనుగ్రహంబునకుఁ బాత్రుండనగుదును.

సీ. ఆసించి నీపద మతిఘోరతప మూను
వానితపోభంగ మే నొనర్తు
నీవేఁడికోళ్ళను నిరసించెనే నేక
భర్తృక నీ్పదాబ్జముల వైతు
వజ్రాయుధము గడ్డిపరకగా ని న్నాది
ర్చినవానిఁ గాండివీకునిగ మార్తుఁ
గైవల్యపదవికై కాలుసాచినయట్టి
ముని నధఃపాతాళమునకుఁ బుత్తు

గీ. మలయపవమానరథ ముండ మాధవుండు
మంత్రియై యుండఁ జంద్రుండు మామ యుండ
సుమశరావళి నేసి గూర్చుదు విరాళి
నలువకును శ్రీపతికిని బినాకి కైన.

ఇంద్ర—సెబాసు వీరాగ్రణీ!

గీ. దేవసంకల్పితములు సిద్ధించుఁ గాత
వింటి నీమాట వీనులవిందు గాఁగ
నెంతవాఁడవు గాకున్న నెట్టిధీరు
నబలలకుఁ జిక్కి దాసోహ మనఁగఁ జేతె.

లోకాదిష్టమ్ముఁ బాప, దానవకంటకోన్మూలమ్ము నెరపఁ గుమా
రజననమ్మునకు మూల మ్ముమామహేశ్వరుల సంధానమ్ము. అయుమ
శీతనగసానువున యోగాసనాసీనుం డగుస్థాణునకుశుశ్రూషఁ బొనర్చు
చుండు. మహేశుం దెరల్చి గిరిజానక్తచిత్తుం జేయ నిన్ను దేవత లభ్య
ర్థించువారు.

మన్మ—సంక్రందనా! ఆజగదీశ్వరుకరుణాకటాక్షమున జగజ్జయినై మాయున నే తిరస్కరించినస్వామి ద్రోహి నగుదునే. నిటలాక్షుఁ డాక్షణంబున నన్ను నేత్రానలంబునఁ గాల్పఁడే? ఒడలెఱుంగని దర్పంబున గంధర్వుఁ డాడినవీరాలాపంబులం బరిగణింపకుము. అచ్చో గా కెం కెచ్చట నైన నాప్రతాప మప్రతిమానము. ఆఫాలనేత్రుం బాఱఁ జూడఁ గలమా?

ఇంద్రు—మదనా! దిగు లొందకుము. అమరైశ్వర్య మంతయు నీపిడికిట నున్నది. అనన్యసాధ్యం బగునీకార్యంబునకు నీవే సమర్థుండవు. ఏలన—

ఆ. వె. ఒండు రెండుఁ జేయ నున్నారు కోదండ
ధరులు వేనవేలు ధాత్రి నిట్లు
రెంటి నొంటిఁ జేయఁ దుంటవిల్లా నునీ
వంటివాఁ డి కెందుఁ గంటఁ బడఁడు.

పుష్పబాణుండవు గాన—

గీ. పూలు దళములు నర్పించుపోల్కి మొఱఁగి
యేనుబాణముల మహేశు నెదను నాఁటి
నగజయం దాతనిమనంబు తగిలియుండు
నట్లు సమకూర్చి దేవకార్యంబు నల్పు.

మన్మ—అ దెట్లు సాధ్యం బగును? ఎఱుఁగవో?

ఆ. వె. భక్తి యుండె నేనిఁ బాషాణములవ్రేటు
చేత నైన ముదముఁ జెందుఁ గాని
భక్తి లేక యిడినపత్రపుష్పాదులఁ
బ్రీతిఁ జెందఁ డెపుడు విశ్వభర్త.

గానఁ బంచబాణమ్ములం బూని వంచనశీలుండనై పూజింప నెంచిన

పంచాననుం దలుక మించి నన్నుఁ బటాపంచలు చేయునే,
ఓయప్పా నే నిప్పని కొప్పఁ జాల మన్నింపుము.

ఇంద్రు—

మ. అకటా దేవతలెల్ల దేహీ యని ని న్బ్రార్థించినన్ బొంగి యు
త్సుకత న్నద్ము బిగించి కట్టి తగుదంచుం బోక యీరీతి వె
న్కకు నంజ న్వడి వేయ నీకుఁ దగ దిక్కార్యంబు సాధించిన
న్బ్రకటం బయ్యెడునీదకీర్తి భువి నాపద్బాంధవత్వంబునన్.

మన్మ—నిజమే సురాసురమానుషప్రపంచంబుల నాకార్య మని
వార్యమే.

సీ. తనకూఁతునే వరించినవిరించిం గని
నాప్రతాపంబుఁ గనంగ లేవా?
అలజలంధరు బృంద నంబుజాక్షుఁడు పొంద
నాప్రతాపంబుఁ గనంగ లేవా?
గురుపత్ని నిర్భీతి మరఁగినశశిఁ గన్న
నాప్రతాపంబుఁ గనంగ లేవా?
జనకువంచించి సృంజయునారదుం డేల
నాప్రతాపంబుఁ గనంగ లేవా?

గీ. గాధిసూనుతపము నీటఁ గలిపె నెవరు?
వ్యాసుజనని యోజనగంధి యయ్యె నెట్లు?
నాకటాక్షమ్మునను గాదె నీకు జగతి
వేయికన్నుల వేల్పంచు బిరుదు గలిగె.

చుటుకుఁ జటుక్కన నేఁ బుష్పనారాచముల నేయఁ బువ్వుఁ
బోఁడులకు జోహారు నల్పు వీరాధివీరు లెంద ఱెందఱు లేరు? ఇందు
శేఖరుం డందఱవంటివాఁడే? నానటికంటిమంట ముజ్జగంబులం గాల్ప

గలవాఁడు. ఆపురహరునకుఁ దక్క నే నొరుల కెవ్వరికి న్వొరవను. న న్నాశూలిపాలి కంపకుఁడు తండ్రీ! నాతప్పు సైరింపుఁడు.

ఇంద్రుఁడు—ఓయీ! దేవకార్యంబునే గౌరవింపవుగా? లోకోపకారకృత్యంబునకుఁ బ్రీతికూలుం డగునీయట్టివాఁడున్న నేమి లేకున్న నేమి? "పరోపకారార్థ మిదం శరీర"మనునార్యోక్తిం బాలింప కుంటివే! ఫాలలోచనునేత్రానలమ్మునఁ గాలినం గాలుదువు గాక. పరోపకారమ్మునకుఁ బ్రాణమ్ముల ధారవోసి కీర్తికాయులై పేరొన్నికఁ గన్నవా రెందఱు లేరు? వారి నొక్కని నైన ననుకరింపఁ జాలవా? ఇట్టి జగదుపకారకం బగుకర్జంబుఁ దెగువన్నీవు చేయకుండినఁ బదుగురలో నగుబాటు, నామాట వినునీ కిది తప్పదు.

మన్మథుఁడు—

చ. మనవిని నాలకింపు కడుమాయలవాఁడు మహేశుఁ డేడ నేఁ
జని కికురించు టేడ? మది జంకును గొంకును బుట్టుఁ గాన నా
పని కిఁక నన్నుఁ బుచ్చిన నపాయము వాటిలు మీకు నాకు నీ
యనునయ మింకఁ జాలు నిటలాక్షునితో మన కెల వైరముల్.

అయిన నింకొకరీతి నే దేవతలకు సేవఁ జేయఁ గలను.

ఉ. మోహము మ్రుమ్మరింపఁగ నమోఘశరౌఘము లెల్ల గుప్పి న
వ్యూహపయోధి ముంచి మిము మున్పులఁ దిప్పల వెట్టురాటన
వ్వ్యూహముల న్నతమ్మ మిథునోచితకృత్యము లేర్పడ న్వరా
రోహల బాహుబంధముల రూఢిగ నొక్కెడఁ గట్టి వైచెదన్.

ఇంద్రు—నే నెంత బతిమాలినను దేవకార్యంబున కియ్యకొనవు. ఉమాసంయోగమీశ్వరునకు మాత్ర మనిష్ట మనుకొంటివా? నీమూలమున సర్వేశ్వరునకును సర్వసుపర్వులకును నతితనము కలుగును సుమా.

మన్మ—నా కేమో భయ మగుచున్నది. నావిన్నప మాలింపుము.

గీ. దనుజదంపతు ల్లీలమై యనవరతముఁ
గలసి మెలసి వర్తించెడికరణి నేను
జేతు నిటమీఁద మనుఁడు నిర్భీతి మీరు
శర్వు నే శరవ్యముఁ జేయఁ జాలఁ జాల.

ఇంద్రు—(తనలో)సాంత్వవచనంబుల కితఁడు లొంగఁ డింక దండసా ధ్యుండే. (ప్రకాశముగా) సుమసాయకా! అమరకార్య మాచ రించిన నీకుందు చిరునగ వొలుకఁ గటాక్షవీక్షణముల నిన్న నుగ్రహించునో, రూక్షేక్షణముల నీక్షించునో సందియము గాని నామాట నిరాకరించిన నిమేషమాత్రమ్మున మచ్చా పానలమ్మున కాహుతి వగుట సత్యము. దూర మాలోచించి కొనుము.

మన్మ—కటకటా! ఎట్టిసంకటము సంప్రాప్తించె! ముందుఁ బోయిన నుయ్యి వెనుకఁ బోయినఁ గొయ్యి. నే నెట్టులను హాతా శుండ నే.(రతితో) ప్రాణేశ్వరీ! ఇంక మన కేది తెరువు? ఏమి సేయుదును.

రతి—నాథా! అమరు లందఱుఁ గూడి మరల నాత్రియంబకు నే.తపంబున సంప్రీతుం జేసికొనక ని న్నిట్టిదారుణకార్యంబునకు నియోగిం ప నేల? వెనుఁ దీసిన జంభారిశాపోద్యుక్తుఁ డౌటయా? ఏటి న్యాయము! నీ వేమందువో గాని యోజించిన నా కొక్కటి తోఁచుచున్నది. ఎన్నఁటికేని శాపమున కవధి యుండుఁ గాని శివాపరాధమున కవధి యున్నదే? హరునిం దిరస్కరించువాఁడు నశించుట నిశ్చయము. "స్త్రీబుద్ధిః ప్రళయావహా" యనసది నెంచి నామాటఁ ద్రోసిపుచ్చకుము. అట కేగి సర్వే శ్వరుం బూజించి యనుగ్రహమ్ముఁ బొందుము.

మన్మ—ప్రియసఖీ! ఔను గాని ప్రతాపవంతుఁన కది లక్షణమా? అమరశాపోపహతుండ నై తచ్ఛాపాంతము౦ బ్రతీక్షించి కలకాలము కష్టపడుకంటె మృదునివలన మృతి నొందినను సురులకోరిక నీడేర్చి జగతిం గీర్తిఁ గాంచుట లెస్స కాదె? నావంటివోటుమానిసి వెనుదీయుట హాస్యాస్పదము. పోయి వచ్చెద.

చ. అజినముఁ గచ్చఁ గట్టి తుహినాద్రిని ముక్కు బిగించి తావన
ప్రజమున కొజ్జ యౌముదివిరాగికి రాగము నింపి యమ్మహీ
ధ్రజ నిదె గూర్చువాఁడ శపథం బిదె దేవతలార! దేవత
ల్లజుఁడు హరుండు భస్మపటలమ్ముగఁ జేయును గాక న న్వెసన్.

రతి—(తనలో) హర! హర! అమంగళము శాంతించును గాక? (ప్రకాశముగా) నాథా! ఈనీయుద్యమము నాకు భయముఁ గొల్పుచున్నది. నాప్రార్థన మాలించి యింటికి మరలుము.

మన్మ—ప్రాణప్రియా! ఏల యిట్లుబేలవై బెగడొందెదవు? నాచెంగట నిలిచి నాప్రజ్ఞం గన్నులారఁ జూచి వత్తువు రమ్ము.

గీ. శాపశస్త్రప్రయోక్తలై తాఁత్రి ముడిగి
సూనశరు నన్ను దీనులై శూలిపాలి
కంపుసురలార దీవించి పంపుఁ డయ్య,
పోవుచున్నాఁడ మీ కిదే మ్రొక్కువాఁడ.

ఇంద్రు—కం. బృందారకులకుఁ దాపస
బృందంబుల కీవు భీతి వెసఁ బాపుచు నా
నందంబుఁ గూర్చు నీ కీ
మందారసుదామ మిడు నమందవిజయముగా!

(మందారమాల మెడలో వేయును.)

రతిమన్మథులు—మహేశా! నీవే శరణ్యుండవు.

(నిష్క్రమింతురు.)

4వ రంగము. హిమపర్వతము.

మన్మ—ప్రాలేశ్వరీ! మనకీర మింతదూర మెంతలో మనలఁ దెచ్చె!
ఇదియే కన్నులపండు వగుమంచుకొండ!

సీ. యక్షగంధర్వ విద్యాధర కిన్నర
చారణోరగసిద్ధ సంకులంబు
మందారమల్లికా మాలతీచంపక
జాతిరసాల విస్ఫారితంబు
ప్లవగసింహవరాహ భల్లూకసారంగ
పుండరీకద్వీప పుష్కలంబు
కల్హారసారస కమనీయసౌరభ
పూర్ణకాసారౌఘ పూరితంబు

గీ. అమరవనితా ముఖాంభోజవిమలముకుర
చంద్రకాంతమణీ సానుసంయుతంబు
నిస్తులతపోని యమయుక్త నిశ్చలముని
రాజమానంబు హిమగిరీంద్రంబుఁ గనుము.

రసవిహీనంబు లగుపశుపక్షిలతావితానంబులు రసవంతంబులై పసం జెందుఁగాక! (ఒక్కబాణ మేసి) అహో! ఏమి యాశ్చర్యము!

గీ. వాయుసంచలనము మానె పాదపములు!
ఝుంకృతమ్ముల సేయవు షట్పదములు!
కుహుకుహూకారములు వీడెఁ గోకిలములు!
మోఘమై మింట నిలిచె నాపుష్పశరము!

ప్రాలేయాచలప్రదేశమం దెల్లెడ సమస్తచరాచరంబులు చిత్రితంబులు వోలె నిశ్చేష్టితములై నిలిచినవి. నాశర మిట్లు వమ్మౌట కేమికారణము? దిక్కులఁ దిలకించును.)

రతి—నాకుడికి న్నదరుచున్నది. ఏమి కీడు రా నున్నదో! ఈనీయు
ద్యమము మానవు గదా?

మన్మ—శతమఖునెదుట నట్టి ఘోరశపథంబు జేసి యిప్పట్టున వెనుదీ
యుట వీరధర్మంబు గాదు. ఇంక నాకుఁ బిఱికిమందు వేయకు.
నామహాజయముం గోరుచు మహాదేవుం బ్రార్థింపుము. (మఱి
యొకబాణము నేసి ఏమిది? ఇదియును నిష్ప్రయోజన
మయ్యెనే! నానిశితశరమ్ముల నరికట్టు బల్లిదుం డెవ్వఁడు? (పరి
కించి) తెలిసె. ఇప్పర్వతపాదపీఠమున నాసీనుఁడై శైలాది నిఖిల
చరాచరప్రపంచప్రశాంతభావమ్ములఁ గాపాడుచున్నవాఁడు.
పోయి వానినే వేఁడికొందును. (పోయి ముకుళితహస్తుఁడై)

చ. సురగణ మెల్ల మేరుగిరి ఘోరభయమ్మునఁ జేరి వేఁడియుం
బరునము లాడి న న్నిటు కుమారభవమ్మునకై యుమామహే
శ్వరుల ఘటింపఁగాఁ బనుప శర్వు శరవ్యముఁ జేయ వచ్చితి
న్వెరవును జూపి నన్ను గరుణింపుము మ్రొక్కెద నందికేశ్వరా.

నీవే నాకుఁ దల్లివి, తండ్రివి, గురుండవు, దైవంబవు, నీకన్న
నాకు వేఱుదిక్కు లేదు. నీమఱుఁగుఁ జొచ్చితిఁ గృపామతి నాకు
వెరవుఁ జూపి రక్షింపవే.

నంది—సంకల్పసంభవా! నేను జూపువెర వే మున్నది? శంభునకు
నీ వహితుండవు కాఁ గలవు. కావునఁ బ్రత్యద్ద్వారంబు
సొచ్చి శూలిపాలికిం జని వేగిరపడక యదనుసూచి సురకార్యం
బు వలసినట్లు నమకూర్పుము. ఇదె నీతోంటిబాణమ్ములంగూడ
నమోఘమ్ములం జేసెద.

మన్మ—ప్రేయసీ! అదిగో వీరాసనమున—

గీ. సర్వతంత్ర స్వతంత్రుండు సర్వమయుఁడు.
నిత్యుఁ డాద్యంతరహితుండు నీలగళుఁడు

యోగపట్టాభిరాముఁడై యోర్పు మీఱఁ
దపము చేయుచునున్నాఁడు మదగ్రముగను.

చ. కంటిమి చంద్రశేఖరుని గన్నులపండువు గాగ నిప్డు వా
ల్గంటి గిరీంద్రపుత్రి కుతుకంబునఁ గొల్వఁగఁ బూర్వపుణ్యపుం
బంట యిదే సుమీ మనకు భాగ్యము పట్టెను సాయకంబుల
న్వెంటను గూర్చి విల్చెదను నీ లగునంతకు జాగరూకతన్.

(అంతలోఁ గలకలారావము విన నగును.)

నందీశ్వరానుగ్రహంబున విహంగకులంబునకు మూతికట్టాడె. ఎల్లెడ రామణీయకంబు శోభిల్లుచున్నది. నే శరము సంధించెద. (సంధింపఁ బోయి)

గీ. భగ్నుపై శరం బేయుఁ గంపమ్ము వొడముఁ
జెమట పట్టును దప్పును చేతిపట్టు
బాణబాణాసనమ్ములఁ బట్టు టెట్టు?
దేవకార్యమ్ము నేను సాధించు టెట్లు?

(ధనుస్సు బాణము నేలఁగూలును. మన్మథుఁడు నిశ్చేష్టుఁడగును.)

రతి—(తనలో) హా! ఏమి యపశకునము! నాపతికి దనుపాతమ్ము సన్నిహిత మయ్యెఁ గాఁ బోలు! దైవమా! ఏమి గతి? మూర్ఛించి నామాటఁ బాటింపక యిక్కార్యమునకు సంసిద్ధుఁ డయ్యెనే! ఇయ్యెడ నితఁడు బ్రతికినఁ బునర్జన్మము గదా! (ప్రకా) ప్రాణనాథా! ఇవె బాణబాణాసనము లందికొని మహాదేవునకుఁ బ్రణమిల్లి మరలుము.

మన్మ—(తెలివొంది వాని నందుకొని) అదిగో గనుము! యోగనిశ్చలచిత్తుం డగుమహాదేవుప్రోలఁ బార్వతి పుష్పాంజలి ఘటించి ధ్యానావసానసమయమ్ము నిరీక్షించుచు నిలిచె. నేను నధిజ్యశరాసనుండనై సమ్మోహనాస్త్రప్రయోగసమయమ్ము నిరీక్షిం

చుచుండు. (విల్లు నెక్కు నెట్టి) అయ్యో! వామభుజస్ఫురణ మరిష్టముఁ దెల్పుచున్నది. నాకుఁ గీడుమూడుట నిశ్చయము. నే నెన్నఁడిట్టిదుశ్శకునముల నెఱుంగను.

శా. అయ్యో యన్నిట కేల పంపె దివిజాధ్యక్షుండు? ఫాలాక్షుతో
గయ్యం బన్నను మాటలే! విశిఖము న్నాటంబుగానాటిన
న్వయ్యేళుల్ త్రుటిలోన నింతు నని భావింపంగ లేనైతి హా!
కుయ్యాలింపఁగ దేవుఁ డొక్కఁడును నాకుంగాన రాఁ డియ్యెడన్.

గరువంబునఁ గన్నుఁ గానక పినాకి నైన నెదిర్చెద నని బీరంబులు వలికి యిక్కార్యంబునకుఁ దగుదు నంచుం గడంగి యిప్పు డిట్టులు బిట్టువాపోవఁ బ్రయోజనం బేమి? అమరస్తోత్రంబుల కుబ్బంగి ముప్పుం దెచ్చుకొన్న నాబోటివెంగలి యొందైనఁ గలఁడే? నాపురాకృతకర్మం బింతకుఁ దెచ్చెను. ఈకుంగికురించి నే నెట్లు జీవింతును? (యోజించును.)

రతి—ఇఁక నైన నాప్రార్థన మాలించి మరలుము.

మన్మ—ఏ మేమి? ఇటులు దీనుఁడ నై వగవఁ బని యేమి? నాదిగదా సార్థకజన్మము!

గీ. దేవకార్యంబు సాధింపఁ దివురుకతన
సంయమీంద్రులకును నగోచరుఁడు శర్వుఁ
డొకట గన్పట్టి సులభుఁడై యుప్పు డిచట!
నిట్టినాభాగ్య మొరులకు నెట్టు లబ్బు?

అనిమిషకార్యనిర్వహణావసరంబున నాదిదేవుని వలన నే బ్రతికినను జచ్చినను గూడ శ్రేయస్కరంబె. అయిన నాయనపదపల్లవంబుల నమ్మినవారి కావల్లవంబు లంటవు.

సీ. సౌదామినీలత సౌరుమించిన ముంజు
లతలు గల్గినజటావితతివానిఁ
బావకహారిణాంత పంకేజ మిత్రత
దనరెడి నేత్ర పద్మములవాని
నతిచారు మారుతాహారహారాలంకృ
తమ్మగువెడద వక్షమ్ము వాని
ఢక్కా త్రిశూలఖడ్గ కుఠారడమరుక
సహితమ్ము లైనహస్తములవాని

గీ. బాలచంద్రకిరీటుఁడై పరఁగు వానిఁ
దలను గంగాతరంగిణిం దాల్చువాని
హైమవతి సేయుశుశ్రూష లరయువాని
దర్శనము నాకు మోక్షప్రదమ్ము కాదె?

సీ. తనపద్మరాగంపుదళ్కు లీనెడుపట్టు
చీరరాగమ్మునఁ జిప్పుసిముంపఁ
దనవజ్రమణిమయతాటంకముల మహో
రుక్కు లీశుమెయిఁ జారుక్కునఁ బడఁ
దనచారువదన చంద్రునితళ్కు లనడివె
న్నెలలు మహాదేవు నలత వెట్టఁ
దనగూర్చు బహుసుగంధద్రవ్యముల తావి
పురహరునకు మహామోద మొసఁగ

గీ. హిమగిరీంద్రతనూజ మహేశుపాద
సరసిజంబులు పూజింప సవిధమంద
నిలిచె జయలక్ష్మి వలె హస్తములను మోడ్చి
మఱి జపించెద నమ్మోహమంత్ర మిపుడ.

(జపించి) దేవదేవా!

చ. కనులను విప్పి చూడు మనఘా ఫలియించెను నీదుపున్నె మే
వనరుహపాణిఁ గూరిచి జపం బొనరించెదొ యివ్వె డాజగ
జ్జనని మనోహరాంగి గిరిజాత నిను స్వరియించి చెంత ని
ల్చెను గరుణింపుమా హితము చేకురు నీకును మాకునియ్యెడన్.

అదిగో కదలుచున్నాఁడు. ధ్యానావసాన మయ్యె. హిమగిరి రాజనందినీ! నీవె ధన్యవు. శూలి నినుఁ బ్రేగంటఁ జూచువాఁడు. నీ చేయుసపర్య నిక్కము ఫలించె. (రతితో) ప్రేయసీ! చూడు.

గీ. తగినతామరపూసలదండ నొసఁగి
పుష్పధనురాకృతిం బోలిపుష్పబోడి
వంచి తనుయష్టి భూతేశుపాదపంక
జమ్ములకు మ్రొక్కెఁ దనలలాటమ్ము సోఁక.

ఆశుగము సంధించెద. (సంధించును. పార్వతి మ్రొక్కును.)

ఈశ్వరుఁడు—అభీష్టవరావాప్తి రస్తు.

(పార్వతి సమర్పించుమాలిక నందికొని లజ్జావనతోత్తమాంగ యగునామెపై రాగరసపూరంబు లగుచూడ్కులం బఱపియు నంతలో (తనలో)జితేంద్రియత నహోదీక్షితుండ నగునాకీయింద్రియక్షోభం బెట్లు కలిగె? (చూచి)

గీ. దర్పకుం డల్లదే దేవదారువెన్కఁ
దాగి శరము సంధించి దోర్దర్ప మొప్పఁ
గన్నుఁ గానక చెలరేగి కావరమున
నన్ను గురిఁజేసెఁ దపము భగ్నమ్ము గాఁగ.

(ప్రికా)ఓరి చిత్తజాతా నాచిత్త మ్మన్యాయత్త మొనర్చిన నీవు మన్నె తాళ్ళుమ్మన శరశరాసనతూణీరసహితమ్ముగ భ
స్మ మయ్యెదవు గాక (భస్మగాఁగ్నిజ్వాల మదనుఁడు పడును.)

రతి—హా నాథా! (మూర్ఛ వోయి నేలం గూలును.)

ఈశ్వ—స్త్రీసాన్నిధ్యము యోగాభ్యాసమునకు సరిపడదు.

(సంభ్రమమున నిష్క్రమించును.)

పార్వ—నాయొనర్చు శుశ్రూష యిట్లు నిష్ఫల మయ్యెంగా!

చ. మదనునిఫాలనేత్రమున మాయముఁ జేసి తిరోహితుండు నై
యదవదఁ బెంచి యీశ్వరుఁ డనాదరభావముఁ జూపి యిట్లునా
హృదయ మలంచె నక్కట! మహేశుఁడు మెచ్చనినాదురూపసం
పద యిది యేల? దుష్కరతపమ్ములపా లొనరింతు నామెయిన్.

పరమేశ్వరా!

గీ. ఆదిమధ్యాంతరహితుండ వఖిలలోక
వంద్యుఁడవు నిత్యుఁడవు మహేశ్వరుఁడ వంచు
నిన్న పతి గాఁగఁ గోరితి నన్ను వేరు
జన్మమందేని సతిగఁ జేకొమ్ము దయను.

(నిష్క్రమించును.)

రతి—(మూర్ఛఁ దేరి)

సీ. హా నాథ నను వీడి న్యాయమే చన నీకు
నీనీడ నినుఁ బాసి నిలువఁ గలదె।
పతిహీనయయ్యె నీరతి యన్న వాదును
భరియింపఁ గలనె విశ్వమున నేను ?
హరుదృగగ్నిజ్వాల కాహుతివగు చిట్టు
భస్మమ్ము వైతివే ప్రాణనాథ ?
నిన్ను దహించిననిటలాక్షుఁ డేల న
న్ననికరంబు వహించి కాల్పఁ డయ్యొ

గీ. మేఘములఁ బాసి మెఱుపులు మెలఁగఁ గలవె?
చందురుం బాసి నిల్చునే చంద్రకాంతి ?

మడువు లింకనకు బ్రదుకునే మత్స్యవితతి ?
నిన్ను నెడఁబాసి నే నింక నిలువఁ గలనె ?

పిట్టపిడుగున నెట్టియిక్కట్టు సంభవించె! "శతమఖుశాపంబునకుఁ గలంగకుము భుజంగభూషణు నెదురింపకు" మని నే నెన్నిభంగులఁ జెప్పినను నామాటఁ బాటింప కిష్టని కేల ప్రాణితివి ? నీవే దిక్కని నమ్మి యున్నన న్నానాథం జేసి యేగితే !

సీ. వేల్పుబానిసలార ! విఱ్ఱవీఁగఁగ నేల
దేవేంద్రు మీ రింకఁ గావఁ గలరె ?
ఉడురాజ ! గౌరవం బుండునే నీ కింక
విరహులు నినుఁ జూచి వెరువఁ గలరె ?
కలకంఠమా ! వట్టికంఠశోష మిఁక కేల
స్మరవికారంబుల నెరపఁ గలవె ?
గంధవాహా ! నీకుఁ గడుక్లేశమే కాని
కొసరి యామోదమ్ముఁ గూర్పఁ గలవె ?
గీ. పాదపతితు లౌ కాంతులపట్లఁ బ్రణయ
కోపలను బ్రసన్నలఁ జేయు నోపు నెవఁడు ?
కటికచీఁకటిం గాంతులఁ గదియుకొఱకు
నెవ్వఁ డభిసారికల నంపు నింక నకట ?

ప్రాణప్రియా ! పలుక వేమి ? నీనగుమోముఁ జూప వేమి ?

సీ. పొలయల్కలం దంపతులు తొంటి బింకాల
వదల నమ్ములసానఁ బట్ట వేల ?
పాంథు లిండ్లం జేరువఱకుఁ గూక ల్వేయఁ
బరభృతమ్ములదండుఁ బంపవేల ?
ఝుంకారటంకారసహితంబుగాఁ జంచ
రీకగుణంబు సారింప వేల ?

మలయమారుతవసంతుల భువనాళికిం
బంపి నీ వింక విజృంభింప వేల ?

గీ. భ్రమరశుకపికప్రముఖ మహాబలంగ మెల్లం
బార్శ్వభాగంబులను బరాబరులు సేయ
జైత్రయాత్రకు నీ వింక సాంగ వేల ?
మన్మనోనాయకా ! వీర మదనదేవ !

నాథా ! ఒక్కనాం డైన నాపైం గోపింపవే ! మున్నన నన్నుం బిలువనంచి వేఱొకతెం దలంచితి వని నే మొలనూలం గట్టినమేలం బుగా నెంచితివే. ఆనాం డెవ్వరుం జూడకుండ నాచెవికొనం దాల్చిన కలువపువ్వుచే మెల్లన నిన్నుం గొట్టిన నవ్వులాటగా నెంచితివే. నేం డింతయలుక మించి నాపలుకు లాలింప వేల ? న న్నిట దుఃఖాంబుధిం దిగంద్రొక్కి నీ వెక్కడి కేంగితివి?—పుడమిం ద్రుటిలో బూడిదెరాశి యైతే ! శిరం బెక్కడ దుల్లు నప్పుడమికిం బాదంబులు నడచు నని పెద్దలు పలుకు నది సత్యము. క్రతుభుజులు కుశాగ్రబుద్ధులు. ఆవిరూపాక్షునితో నిష్కారణవైరంబు నీకుం దెచ్చిపెట్టిరి. నీటిలోతు నరయం బెరవారిబిడ్డల నంపుట లోకమున నున్నదే కదా ? ఇంక నా కేది దిక్కు ? మహాదేవా ! కృపామతి నాపతితప్పు సైరించి సశరీరుం జేసి యనుగ్రహింపం గలకర్త వీవ. లోకేశా ! ఆర్తజనశరణ్యుండవు, రక్షింపుము—స్థాణునకుం గారుణ్య మొకటియా పురహరా ! నీ వెంతటి కఠినాత్ముండవు ?

చ. సురపతి వేడగాం దనప్రసూనశరమ్ముల నేసి నీకునుం
బరిణయముం బొనర్చి యిలు వాకిలిం గూర్పంగ నెంచునాథుని
స్మరమపరోపకారపరు భస్మ మొనర్చితి వంతె కాని యా
గిరిజకుం దక్కె సౌఖ్యమొ యుసిరించిన పాపము గట్టికొంటివే !

గీ చంపినం జంపుదువు గాక చలమున మెయి
కాన రాకుండఁ జేసెదే కాంతు నకట?
ఉపకృతిం జేయ వచ్చిన నసురు లూడ్చ
నాయ మయ్యెడినే భూతనాథ నీకు.

పశుపతి పలుకునా? ఇఁక నెవరితోఁ జెప్పికొందును. ప్రాయోప వేళ మొనర్చి ప్రాణనాథుఁ గలసికొందును. ఎవ రడ్డుకొందురో చూచెదం గాక!

సీ. చితిఁ జేర్చి యగ్ని సంస్క్రియఁ జేసి కడసారి,
సంతోష మిమ్మ వసంత నీవు
అపరమంత్రంబుల నలరించి కూర్చుమా,
శాంతి మాకు శుకద్విజంబ నీవు
సహకారమంజరు ల్సమకూర్చి యిఁక మాకుఁ
బిండమ్ము లీయవే పికమ నీవు
తమ్మితేనెం దెచ్చి ధర్మోదకం బీవె,
బంధుల మగుమాకు భ్రమర నీవు

గీ. చందనాగురు కస్తూరి చాదు సేసి
మీర లెల్లరుం జేరి పూనీరు విడువుఁ
డంగజుని నన్నుఁ దలఁచి సమర్పణమ్ము
భక్తిఁ జేయంగఁ దగును దంపతుల కింక.

(ప్రాయోపవేశమునకుఁ గడంగును.)

అశరీరవాణి—రతీ!

గీ. తెగువ మానుము బ్రతుకు నీమగఁడు మరల
బ్రహ్మ తనకూఁతు మోహించి భావజుండె
పాపకారణ మని కిన్కఁ శాప మిడినఁ
గాలకాలుని నేత్రాగ్నిఁ గాలె నిట్లు.

ఉమామహేశ్వరోద్వాహపర్యంత మోర్చునది.

రతి—దేవదేవా! నాప్రియుం భస్మీకరించి మొగము చెల్లక నన్ని ట్లంబరవీధి నోదార్చుచుంటివా? నీవు నశరీరుఁడ వైతివే? మాఱు వల్కఁడు. కృపానిధీ! మాదంపతులఁ గూర్చు భారము నీయది! (నిష్క్రమించును.)

---

5 రంగము హిమవత్పర్వతారణ్యము.

(పంచాగ్నిమధ్యమునఁ బార్వతి తపముఁ జేయుచుండును.) సఖులుజయావిజయ లుపచారములఁ జేయుచుందురు. ఈశ్వరుఁడు వృద్ధబ్రహ్మచారివేషమునఁ బ్రవేశించును)

జయ—సఖీ! ఎవరో మేదినీసురు లేఁగుదెంచువారు.

పార్వ—(తపముఁ జాలించి) పూజాద్రవ్యములం దెమ్ము, వారి కతిథిసత్కారముఁ జేయ వలయును.

(ఉచితాసన మర్పించి యర్ఘ్యపాద్యాదు లిచ్చి సేవింతురు.)

వృ-బ్ర—బాలికలారా! ఈతరుణతపస్విని యెవరు? మీ రెవరు?

జయ—ఈమె హిమగిరిరాజనందిని యును. మే మీమెపయస్యలము.

(పార్వతి నమస్కరించును.)

వృ-బ్ర—శుభ మస్తు. ఈప్సితార్థసిద్ధి రస్తు. కల్యాణీ!

సీ. సేమంబె నీకు నీచెలికత్తియలకును
నాశ్రమమృగముల కబ్జనేత్రి?
నిత్యాగ్నిహోత్రమ్ము నెరపంగ నున్నదె
యింధనసముదాయ మిందువదన?
ఎట్టివిఘ్నముఁ జెంద కీనీయొనర్చెడి
తపము సాఁగుచు నున్నె తలిరుఁబోడి?

కుసుమసమృద్ధియుఁ గిసలయపల్లవర్ధియుఁ
గల్గి యున్నవె యిందుఁ గంబుకంఠి ?

గీ. తగ "శరీర మాద్యం ఖలు ధర్మసాధ
నమ్మ" టన్న నెఱుంగవో యిమ్మెయినిఁ ద
పమ్ము సేసెదు నీదుభావ మ్మదేమొ
తెలియ రాకున్నయది యింత తెగువ తగునె ?

ఉ. మానిని ! పుట్టినింట నవమానము కల్గెను ? దండ్రి యల్గెనో
మేన సుభూషణా లిడదొ మేనక ? చీరలకుం గొఱంతయో ?
పూనిక నేల యిట్లు నరి పుచ్చెదొ నీయెలబ్రాయ మంత ? నీ
మేనును డయ్యఁ జేయు మితి మీఱినసుస్థలు కష్ట మక్కటా !

గీ. ఘోరతప మాచరింపఁగాఁ గారణమ్ము
నున్న దున్నట్లు నాతోడ నన్నుమిన్న !
చెప్పఁ దగు నేని కొంకక చెప్పు మిపుడు
తరుణి ! నన్నన్యఁ గా నింకఁ దలఁప వలదు.

ఆరయ దుర్లభవరాభిలాష యీదుష్కరతపంబులకుఁ గారణ
ముగాఁ దోఁచెడిని. అందులకే నైన నీతపం బెందులకు ? జనులు
రత్నము నన్వేషింతు రే గాని రత్న మొరుల నన్వేషించునే ?

జయ—జనకునింట శైశవమునుండి శ్రుతిస్మృతిపురాణేతిహాసంబు లనే
కంబుల విని మానసర్వమంగళ శంకరుండును మృత్యుంజయుం
డును నగు నప్పరమేశ్వరుండు తనవిభుం డగుఁ గాక యని శివుం
ధ్యానించుచు నిశ్చాన నాకునే నొల్లక తపంబు సల్పుచున్నది.
విజయ—అహోరాత్రింబు లాహారు మంత్రింబుల జపించుచు శివనామ
సంకీర్తనంబు సేయుచు సర్వప్రపంచంబు శివమయం బని తలం
చుచు నిశ్చాంత దుష్కరతపంబు లాచరించుచున్నది.

జయ—బ్రాహ్మణోత్తమా! నీమంత్రతంత్రంబుల ననుగ్రహించి యీశుణం బీమె వీక్షణంబుల కావిరూపాక్షుం బ్రత్యక్షుం జేయుమా?

వృ-బ్ర—(పార్వతితో) ఓజవ్వనీ! నీవయస్యాలాపంబులు లపహాస్యం బులో విశ్వసనీయంబులలో నాకు సత్యంబుగా నెఱింగింపుమా.

పార్వ—భూసురోత్తమా! మత్సఖీవచనంబులు సత్యంబులే. మృత్యుం జయుం భర్తగాఁ గోరి యీరీతిఁ దపంబు సేయుదాన. మీకరుణాకటాక్షంబున నాభక్తవత్సలుండు నన్నుఁ బరిగ్రహించున ట్లనుగ్రహింపుఁడు.

వృ-బ్ర—(పకపక నవ్వి చప్పటలు వైచి) సరిసరి! బాగు! మంచివానినే కోరుకొంటివే? ఈబుద్ధి నీకే గలిగినదా? యెవ్వరైన బోధించిరా? ఆదిగంబరుం గట్టుకొని సుఖంప నెంచితివో! సర్వానవద్యాంగీ! ఇందులకా నీసుకుమారాంగకముల నవయఁ జేయుట? నీకన్న మూర్ఖురా లెవరు? పావనగిరిరాజవంశమ్మున జన్మించితివి. రూపగుణసంపదల ననుకూలుం డగు వరుండు లోకాలమ్మున నీకుఁ గఱవయ్యనే? నీతలిదండ్రు లిందుల కియ్యకొనిరే? అందఱుం బెడబుద్ధులం బుట్టిన నే నూరకుండఁగలనా? సఖ్యసంబంధంబు సాప్తపదీనంబు గావున నిందనుక ముచ్చటించుట నే నీకాప్తుండ నైతి. నామాట విను. ఇఁక నైన నీబుద్ధి మరలింపుము. ముల్లోకంబుల నట్టి మొఱ్ఱవాసిం గనఁ బోవు.

సీ. పునుకపేరులఁ దాల్చి భూతగణమ్ములఁ
గూడి చరించుకాటేఁడు సుమ్ము
పచ్చితోలుం గట్టి బసువమ్ము మైఁబూసి
బికిరమ్ము నెత్తు భిక్షుకుఁడు సుమ్ము

పుచ్చడీకతనమ్ముఁ జోనాడుదిసమెుల
పుట్టిలో భక్షించు వెఱ్ఱిసుమ్ము
కులగోత్రములు లేనికోణంగి సతము భు
జంగసంగతిని మెలంగు సుమ్ము
గీ. చేఁదు మేపరి వెనుకొండెసిగలవాఁడు
ననసురూపంబు లగుదృష్టు లమరువాఁడు
తలను దోషాకరు న్మెచ్చి నిలుపువాఁడు
ధనదు నిచ్చలు యాచించి మనెడివాఁడు.

ఇంక భీభత్సంబె కాని శృంగారరసం బన్న సున్న. భద్రాసనార్హ వగునీవు వ్యాఘ్రాజినంబున నెట్లు కూర్చుండె దవు? మణిమయకంకణాంచితం బగుకరంబుచే గాలభుజంగకంకణ భయంకరంబగుతత్కరం బెట్లు పరిగ్రహింపఁ గలవు? నీకౌశేయవస నంబులతో నతనికట్టకుఁ బచ్చికరిచర్మం బెట్లు ముడివడియెడిని? భర్మహర్మ్యాంతఃపురంబుల హంసతూలికాతల్పంబుల నొయ్యారంబున మేను వాల్పఁ దగును గాని భయానకం బగుశ్మశానంబున వానితోఁ దైతక్క లాడెదే? నీ వోర్చిన నే నోర్వఁగలనా?

గీ. దేహి యనుచును బ్రతివీథిఁ దిరుగువానిఁ
బరిణయం బైన నేముండు ఫలము నీకు?
నన్ను వరియింప రా దకే వన్నెలాడి?
నీవు కన్యాలలామవు నేను వటుఁడ.

నన్ను నాహరునిగ భావింప రాదా? వృద్ధుండ నైనఁ దపోని యమమ్మున నవయౌవనుని మించినవాఁడఁ జుమీ! ఏలోకంబున మత్సముండు నీకు లభించుట కల్ల. అష్టైశ్వర్యసంపన్నుఁడను. నన్నుఁ గొల్చువారికి కల్పములనోభీష్టమ్ముల నిచ్చుచుందు. అయమునంగను వింక

దలంపకుము. నాకోరిక మన్నించి నన్ను వరింపుము. శీఘ్ర మనుగ్రహింపుము.

పార్వ—(చెవులు మూసికొని) హర హర! ఎట్టికఠోరవచనంబులు వినవలసి వచ్చెను. తపోవిఘ్నం బొనరింపఁ జేరిననిశాచరశేఖరుండో, మూర్తిభవించిననాపురాకృతకర్మఫలంబో వీఁడు!
(కోపము సూచించును.)

వృ-బ్ర—గీ. తరుణి నాయర్ధదేహమ్ము ధార వోతు
గున్నయేనుంగుఁ బోలినకొడుకుఁ గనెద
వత్తమామలరట్టు లేనట్టిమనువు
సుమ్ము యోజించి కొనుము నీనెమ్మనమున.

పార్వ—సఖులారా! ఈధూర్తుం డాసచ్చిదానందస్వరూపుం డగుశంకరుం గూర్చి యప్రియంబు లెన్నియో వచించి ప్రేలరియై నామనంబు బాధించుచున్నాఁడు. వీని న్వేగ నావల కంపుఁడు. (రోషముతో వెనుఁ దిరుగును.)

జయ—సీ. కాటికిఁ గా ల్సాచుకడువృద్ధు వీ విడ్డు
పల్లకి నెక్కెదే బావ లెమ్మ (లాగును)
విజయ—బింకమ్ముగాఁ బాగ బిగియించి సుట్టితే
తల మేలు సోఁకెనా తాత నీకు? (పాగదీయును)
జయ—పెండ్లికై నీ వేల వేగెదో మఱఁది ని
న్మోహింపదే సుంత ముక్తికాంత? (ఊఁపును)
విజయ—పాపలపై నాస పాయదా బావఁడా
పెండ్లిసేతుము నీవు వెడలకున్న (భయపెట్టును.)
జయ—గీ. కోపమూ పండ్లు లెక్కింపఁ గోడెకాఁడ? (పండ్లఁ జూచును)
విజ—పెద్దతిలుకంబు దిద్దితే పెండ్లికొడుక? (తిలుకముఁ దుడుచును)
జయ—వేదపారంగతుని బోలి వేష మేల? (వెక్కిరించును.)

విజ—సరస మాడకు మోరోరి తరలు మింక. (నెట్టును.)

వృ-బ్ర—మానినీమణీ! నడుమ నీసఖు లేల? నీవేశిక్షించిన నన్నుగ్రహ మ్మగదే.

చ. సరసిజనేత్రి? నన్ని విచారణ సేయ వ దేల? యుండవే
వరశుభలక్షణావళు లవారిగ నాయెడ? నిక్క మాను నే
మరుని జయించినాఁడ నను మానము మానుము నమ్ము రాజశే
ఖరుఁడను జూడు చూడు మిఁకఁ గన్నడ సేసెదొ? యేలెదో? కృపన్.

(సాక్షాత్కరించును. పార్వతి తిరిగి చూచి సంభ్రమమున వెకకు మరలి పోఁ బోవును.)

ఈశ్వరుఁడు—(పార్వతిచెయిఁ బట్టి)

గీ. ఓతలోదరి! మెచ్చితి నీతపమున
కమ్మఁ బడితిని న న్నేలుకొమ్ము నీవు

పార్వ—(లజ్జతో)

పితృధీనను గాన న న్బెండ్లియాడఁ
దగును హిమవంతుననుమతిఁ ధర్మనియతి.

ఈశ్వ—(పార్వతిని విడిచి) అట్లె యగుఁ గాక! కొలఁదిదినములలో నీతలిదండ్రుల నడిగి సమస్తసురలు గొల్వ మహోత్సవంబుగా వివాహంబుఁ జేసికొందును.

(నిష్క్రమించును.)

జయ—(పార్వతితో) సఖీ! నేఁటికి నీతపంబు ఫలించె. వే రమ్ము పూజ్యు లగుజననీజనకుల కీవృత్తాంతంబు సత్వరం బెఱింగింప వలయు.

(నిష్క్రమింతురు.)

---

6 రంగము హిమవంతునిల్లు.

హిమవంతుఁడు, మేనక, అరుంధతి, ఋషులు నాసీనులై యుందురు.

ఆంగిరసుఁడు—భూభృదగ్రణీ! బాగుగ నాలోచింపుము.

ఆ. వె. పెండ్లికూఁతు గౌరి పెండ్లిపెద్దల మేము
దాత వీవు ప్రతిగ్రహీత శివ్వుఁడు
సంప్రదాయ మింకఁ జర్చింపఁ బని లేదు
మేలు మేలు మేలు శైలరాజ!

అష్టైశ్వర్య సంపన్నుం డగుపరమేశ్వరు నల్లునిఁ గాఁ బడసి పూజ్యుండ వయ్యెదవు. కులీనులలో నగ్రణియు వాసియుం గలుగును. ఆర్యయం దా జగద్గురు తేజంబునం గుమారుం డుదయించి దేవతలకు సేనానియై దైతేయుల సమయించును. నీమూలమున దేవలోకమునకు మే లగును.

హిమ—ఋషిసత్తములారా! మీచరణసేవాప్రభావంబునం బావనుం డనైతి. మత్తనూజ నిచ్చి దేవదేవునికోర్కెఁ దీరుతురు గాక!
(భార్యవంకఁ జూచును.)

మేనక—నాథా! తొందర యేల? ఆమహామహుని మహిమంబుల విని తనయ నీయ నాసక్తియుఁ గోపస్వభావం బని విని భయంబును జనింప మన్మనంబు ద్వివిధంబై యుండు.

సీ. మాట పట్టింపుచే మామ దక్షునిఁ బట్టి
గొంతుఁ గోయించినక్రూరుఁ డంట
వరపురోహితుఁ డైనపరమేష్ఠిశిరమును
గోట మీటినయట్టికూళ యంట
ధర్మంబుఁ గాపాడుధర్మరాజుం దన్ని
[illegible]

తనమేలు సేయ వచ్చినమన్మథుని మున్న
మున్నఁ గాల్చిన శుద్ధమూర్ఖుఁ డంట

గీ. ఉగ్రుఁ డంట మఱుక్కపైఁ గోప మెందు నంట
గోల మనబాల యేలీల నాలి యేలఁ
కత్తిపై సాము సేయంగఁ గల దటంచు
వలదె చింతింప మదిఁ బదింబదిగ మనము?

(అరుంధతితో) అమ్మా! సాధ్వీరత్నమా! మగవారి కే మెఱుక? ఆఁడుదాన నాఁడుబిడ్డలం గన్న వారికష్టసుఖమ్ము లెఱుంగుదానవు. గాన నానందియమాలం దీర్పుము, సంబంధంబు కలియుచోట నొకానొకప్పు డిట్టివారికి స్వభావవ్యత్యయంబు గలుగక మానదు. సమానులకైన నది సుఖకరము. కానిహస్తిమశకాంతరంబున్న మావాడ నది యెట్లుపరిణమించునో! హా! బ్రహ్మాదులకే భర్గుమహిమల నెఱుంగుట కష్టము. మే మన నెంత వారము? మాబాలిక యేవంక నొక్కింతఁ జింతించిన నే నోర్వఁ గలనా? అతఁడు రుద్రుండు సౌమ్యుండు గాఁడు. ఆ మహాభాగునకుఁ గావలసినవా రెవ్వ రెందునుం గాన రారు. మాతనయ మమ్ముం గూర్చి ముం దెన్నఁడు విచారింపకుండ యోజింపుము.

అరుం.—అమ్మా మేనకా! సంశయింపఁ బని లేదు. నీ వెఱుఁగవు. నా మాట నమ్ముము. జగజ్జనకునకు జననీజనకు లెట్లుండుదురు? జగచ్ఛాసనమందు దుష్టశిక్షాశిష్టరక్షణంబులు సేయ వలదే? ఆదక్షుం డాత్మజాసమక్షమున మహేశుం దూషించినకతంబున మడిసె. భక్తవత్సలుండు గాన మృకండసూనుం బాధించునంతకు శిక్షించె. మన్మథుండు బ్రహ్మశాపవశంబున నాతని నేత్రాగ్ని కింధనం బయ్యె. వక్రచిత్తుం డగు బ్రహ్మ కించుకబుద్ధి సెప్పె

నే మైన నేమి? మరల వా రంద ఱాయనకరుణకుఁ బాత్రులైరి గదా? ఏమహానుభావుఁడు రక్షకులకు రక్షకుండు, సంహర్తలకు హర్త, యెవఁడు జననమరణంబులు లేక లోకంబుల సృష్టిస్థితిలయంబులు సేయుచుండు నట్టిపురాణపురుషునకు నీ నందని నిచ్చి కన్యాదానఫలం బందుము. నీతనూజ మహేశ్వరుం గూడి మహైశ్వర్య మనుభవింపఁ గలదు.

మేన—ఆర్యులారా! మీ కందఱికే ననుజను. అజ్ఞానంబున నే నా మహామహుం దూల నాడి పలికినపలుకులం బాటింపక మన్నన నాకన్నియం బరమేశ్వరుండు పరిగ్రహించున ట్లొనర్పుఁడు. శుభస్య శీఘ్ర మ్మన విందుఁ గాన నిఁక నాలసింపకుఁడు.

హిమ—శుభము. వివాహమ్మునకు శుభముహూర్తము మీరే విచారింపుఁడు. ఇదె పార్వతిజన్మపత్రము.

(ఋషులు యోజింతురు. పార్వతి ప్రవేశించును.)

గీ. అమ్మరో! రావె నీదుతపమ్ము పండెఁ
బడయఁ గల్గితి గృహమేధిఫలము నేఁడు
మౌనివర్యులపాదపద్మముల కెఱఁగు
మమ్మ నినుఁ గోరి పంపె శీతాంశుమౌళి.

(పార్వతి ఋషులకు నమస్కరించును.)

ఆంగి—శీఘ్రమే కళ్యాణ మగుఁ గాక! జగన్మాతవై మునుముందు నీవే మామ్రొక్కు లందుకొనెదవు. తారాచంద్రబలంబును గ్రహమైత్రియు జామిత్రశుద్ధియుం గలిగి రేపురాత్రి యుత్తరఫల్గునియం దొప్పినముహూర్తము శుభావహంబై యున్నది.

హిమ—ఇంతత్వరలోఁ దూఁగఁ గలమా?

ఆంగి—అనంతరత్నప్రభుండవు. సంకల్పసిద్ధుండవు. విశ్వకర్మం బిలువ

నంపినంత నేలోపము లేకుండసమస్తమూయత్త్వముపఁ గలఁ
డు. శుభ మస్తు. రేపు తరలి వచ్చువారము.

హిమ—చిత్తము. (నిష్క్రమింతురు.)

---

## 7 రంగము హిమవంతము.

---

కోలాహాలము విన నగును. సంభ్రమమున వసుభూతి ప్రవే
శించును.

వసు—అమ్మయ్యా! ఇక్కడ చేరుకొనినప్పటికి నాప్రాణములు కూటఁ
బడినవి. చాలుఁ జాలు. రత్నగర్భుండును మహైశ్వర్యసంప
న్నుండును నగు హిమగిరీంద్రునేకతనయావివాహమహోత్సవ
మతివైభవముగా జరుగు ననుకొంటిని. ఏమి మగపెండ్లివారు!
ఏవంకఁగనిన జడలదయ్యములు బూడిదబూచులునే గాన
నయ్యెడిని. నగేంద్రుం డానరేంద్రు నెక్కడనుండి తెచ్చెనో
గదా! గోముగఁ బెంచి కూఁతును బాములవానిపాలు చేయు
నేల? అవును. నగేంద్రునకుఁ బన్నగేంద్ర సంబంధ బాంధవ్యము
సరిపోయినది. అడుగడుగునఁగాళ్లఁబడిఫూత్కారంబులంగావించు
కాలభుజంగంబులును నలువంకల విచ్చలవిడిం బఱువు లెత్తినేలఁ
గయ్యంబునకుగాలుద్రువ్వ మదిక్కులుమూఁకుమోర్తియుఱంకెలిడి
వాఁడికొమ్ములఁగుత్తుఁ జూపి బుస్సలఁ గొట్టుచుఁబోతు కోడె
లును బురంబునఁ జెలరేఁగి సంచరింప భూరిదక్షిణలు సంభావ
నలుం గల్గుననికంపెడాసతోనామడవలీల వెనక వైచి వచ్చినడి
నభూదేవులకు నిలువ నీడ యేని లేకున్నదే! అదిగో యెవరో

వచ్చుచున్నట్లున్నది (చూచి) ఏమి శ్రీధరా! ఆజంతువు లెక్క-డకుం దరుముకొని వచ్చుచున్నవా? (భయము నటించును.)

శ్రీధరుఁడు—జడియకుము. ఒక్కనిమిసము మాత్రి మల్లుఁడలిగి యావేగముఁ గల్పించె నిప్పుడు సర్వమును కూలమయ్యె.

వసు—ఎట్లెట్లు? ఈమాట లేమి?

శ్రీధ—హిమవంతుఁ డనుగ్రహించినదక్షిణాద్రవ్యము, మాయలేకున్నాను.

వసు—అయ్యో! అయ్యో! మించిపోయినదా? నాకు శూన్య మేనా? వృథాప్రయాస మయ్యెనే.

శ్రీధ—ఆలసింపక వేఁ బొమ్ము. నీకును లభించును.

వసు—పాములుఁ బోతులుఁ బో నీయవే?

శ్రీధ—నేనును వచ్చెద రా వోయి. (నడచుచు) పురంబునఁ గల్గుయలజడి మాన్ప మని నగేంద్రుండు పన్నగేంద్రభూషణుని వేఁడికొనినంత సర్వము నిముసములోఁ బ్రశాంత మయ్యెనిప్పు డానవమోహనాకారుం డగుబాలచంద్రకిరీటునిం దిలకింపవేయికన్నులుం జాలవు రౌద్రిం బెల్లఁ దుగ్రిటిలో సమ్మోహనంబుగా మాఱె. వడివడిపదమా.

(నిష్క్రమింతురు.)

(పురవీథి మాటలతో మరలఁ బ్రవేశించి)

వసు—శ్రీధరా! తొలి నే నేమో యనుకొంటిని గాని గిరిరాజువదాన్యత నెం తని గొనియాడఁ గలమోయి? అట్టిత్యాగశీలుఁడు గనుకనే తనపూర్వపుణ్యఫలంబునం బుత్రికకనురూపుం డగువరుఁడు లభించె నరిగా వివాహసమయంబు

నకే వచ్చి యస్టమూర్తికి సాష్టాంగదండప్రణామంబు లాచరించినరతిమన్మథులం బోలుజంపతు లెవ్వరోయి?

శ్రీధ—వారు నిజముగ రతిమన్మథులే. వానవుని వేఁడికోలు నంగీకరించి శంకరుండు తనకల్యాణంబున కాదికారణుం డగుకుసుమకార్ముకుని మఱలఁ బ్రసాదించె.

వసు—కన్యాదానసమయంబున ధీరుం డయ్యు గట్టురా జెట్టులు శోకవిహ్వలుం డయ్యె! మేనకాదేవిని మించి దుఃఖంప సాగఁబాపము.

శ్రీధ—ఆవైక్లబ్యము గృహస్థునకే గాని నీవంటిబ్రహ్మచారి కే మెఱుకరా?

గీ. కొడుకు కొడు కౌను కోడలిం గూడుదనుక
గూఁతు రన్న నేకాలంబుఁ గూఁతు రగు న
టంచుఁ గూఁతును గని ముదం బందు వాఁడు
బొట్టి యను బాయలే కట్లు పొక్కు టరుదె?

(పురజనులు సందడితోఁ బోవుచుందురు.)

వసు—(ఒకనితో) ఎచటి కయ్యా, యింతఁ దొందరగాఁ బోవుచున్నారు?

ఒకఁడు—కోటకు. ఎఱుఁగవటయ్యా? నూతనవధూవరులకుఁ బెండ్లివారంద ఱుత్సవాంతమున నానందనీరాజన మిత్తురు. ఆనేత్రోత్సవముం జూడకున్నఁ గన్ను లున్నఫల మేమి?

వసు—మరల నేమైన సమ్మాన ముండునా?

ఒకఁడు—ఏమో, నీయదృష్టము.

శ్రీధ—మేమును వచ్చెదము.

(నిష్క్రమింతురు)

(వివాహమంటపమున వధూవరులును పెండ్లివారును
కర్పూరనీరాజన మిచ్చుచుందురు.)

అరుంధతి—కం. మంగళ మగుశంకరునకు
మంగళమగు శ్రీతుషారమహీధరసుతకున్
మంగళ మగుమన్మథునకు
మంగళమగు రతికి దివికి మంగళ మగుతన్.

---

8. రంగము హిమవంతునిమందిరము.

---

పార్వతి, యీశ్వరుఁడు ప్రవేశింతురు.

ఈశ్వ—ప్రేయసీ! యేల మాఁగ్రోగము పెట్టి పేరలుకం జెందెదవు?
(మొగముఁ ద్రిప్పఁ బోవును.)

పార్వ—చాలుఁ జాలు నీమోసము. (తమ్మి మొగడతో నతని దాకి)

చ. మనుగుడుపుత్సవంబులు సమాప్తిని జెందగ లేదు మామ నీ
కనిశము వేడ్కనింప దివిజాంగన లాడగఁ బాడఁ జేయు నీ
మన మిపు డెవ్వతెం దగిలె? మన్మథుఁ గెల్చినవాఁడ వేమొ? మే
మునఁ జిరుచెమ్మట ల్వొడమె; నూల్కొనెఁ బుల్కలు నేమిహేతువో?

ఈశ్వ—ఇట్టియనుమాన మేల? ఊరకయ నాపై లీలారవింద మేసితివి. చూడుము, పుష్పాసవంబు సోఁకి కన్నుల నీరు గ్రమ్మెడిని. నాపై సెమర్పు గారణ మాలింపుము—కాంచీపురంబున వీరమాహేశ్వరాచారసంపన్నుం డగుచిరుతొండం డనుమద్భక్తశ్రేష్ఠుం డుండు. ఆతఁ డెంద తెండలు జంగమ ప్రముఖు లేతెంచి యే వేళ నే మేమి యడిగిన లే దనక యీప్సితార్థంబుల న్నను

కూర్చి యిచ్చువ్రతముఁ గలవాఁడు. నేఁ డొకఁ డేతెంచి శివలింగాభిషేకార్థ మిక్షురసమ్ముఁ గోర నతఁడు బిరాన నేఁగి పుండ్రేక్షుదండశతంబుఁ గొని మోపుఁ గదల్ప లేక యవశుం డయ్యె. నే నాసరసరసాలప్రకాండతండం బొకవంక నెత్తికొంటి నతఁడును నింకొకవంక నెత్తెను. ఆభారంబున డస్సి యతఁడు సెమర్చె. నేనును సెమర్చితి. భక్తకోటికి నే వలతు నిదియుఁ దప్పిదమా ?

పార్వ—దేవా ! నాతప్పు మన్నించి యావీరశైవుం జూపవే.

ఈశ్వ—నీకుతూహల మ్మిదె తీర్చెద వానిభక్తిం బరీక్షింతము రమ్ము.

(నిష్క్రమింతురు.)

(జవనికదిగును.)

ఇది ప్రథమాంకము.





శ్రీ ర స్తు.

# శివరాత్రి

ద్వితీయాంకము — సిరియాళ చరిత్రము.



1 రంగము. కాంచీపురోపవనము.

(చిరుతొండ శ్రేష్ఠి ప్రవేశించును.)

చిరు — (తనలో) ప్రాతఃకాలశివపూజం గావించి దేవదేవున కుపహార మిచ్చి వచ్చితి. వీరశైవసిద్ధాంతానుసారంబుగ మాహేశ్వరారాధనముఁ జేయక మాధ్యాహ్నికపూజం గావింపనినానియమము శైవుండొక్కరుండును మొగసాల కేతెంచనినేఁ డెట్లు పాలింపఁ గల్గుదునోగదా! ఏమి చిత్రము!

గీ. కడవలం ద్రిమ్మరించినకరణి వాన
మూఁడువారము ల్బోరున మొత్తినపుడె
జంగమారాధనక్రియ సాఁగెఁ గాని
రాఁడు శివయోగి యొకఁడును నేఁ డదేమొ!

ఆకసము చిల్లి పోయిన ట్లాసారమున కంతము లేక భూమ్యాకాశము లేకమై ప్రళయకాల మాసన్నమైనటులుండినదుర్దినంబుల సైతము నావ్రతంబు నిరుపద్రవంబుగాఁ గాపాడినసర్వేశ్వరుండు నేఁడు మాత్ర మన్యథా యోజించునా? ఇక్కాంచీపురంబున నెల్లప్రదేశంబుల న్వెదకియు విఫలమనోరథుండ నైతి. ఈయుద్యానంబున నాజీర్ణదే

హాలయగర్భంబున నాగంతుకు లప్పు డప్పుడు విడియుచుందురు. అం దును జూచెదఁగాక. (పోయి చూచి) ఓహో! యేమినాయదృష్టము! సదాశివుకారుణ్యమే. జంగమమిథునంబు గాన నయ్యెడిని.

గీ. భర్త పులికళానంబుపైఁ బవ్వళింప
భార్య పాదంబు లొత్తుచు భక్తిఁ గొలువ
మహిని వెలసినయాదిదంపతులువోలె
వెలుఁగుచున్నారు కడువయోవృద్ధు లిచట.

(సమీపించి) శరచ్చంద్రచంద్రికాసంకాశ శిరోజజటాభరులై జరాజర్జిత దేహులై రుద్రాక్షమాలాభసితత్రిపుండ్రకుంకుమాలంకృతులై భక్తిభరితులై నేత్రోత్సవముఁ గొల్పుచున్నారు. అయ్యగారించుక రుజావీక్షితులు గా నున్నారు. పాప మవ్వగారంధలు. (ప్రకా) శరణు స్వామీ శరణు (నమస్కరించును.)

యోగి—శివో రక్షతు.

చిరు— గీ. అరయనయ్యమాకు న్నీర లమ్మగారుఁ
బార్వతీపరమేశులై రుర్వియందు
వచ్చి కృపను మాగృహము పావనము గాఁగ
నాచరింపంగ వలెను లింగార్చనంబు.

(యోగి చెవు డభినయించును.)

చిరు—(ఉచ్చైస్స్వరంబున) మహానుభావా! దయచేసి మాయింట నేఁడు శివపూజఁ గావింప వేఁడుచున్నాను. అనుగ్రహింపుఁడు.

యోగి—నమ శ్శివాయ. నీవంశమేది? ఏమి కులమ్ము? నీపేరు? శివభక్తపూజాచార నిర్వహణదీక్షాతత్పరుండవే? భార్య యనుకూలమై నీ చెప్పినయట్లు నడచునా? సంతానమా? నీ వాడితప్పనివాఁడవే? నాకోరినకోర్కి దీర్పఁ గలవే? ఊర కడిగితిమి

గాని నీవెవ్వండ వైన నేమి? వీరశైవవ్రతనిర్వాహణదక్షుం డగు కుమారుం డొక్కఁడుండినఁ జాలును. వేయేల? నామనోరథమ్ము విను. నేఁటి కొకవత్సర మాయె మహాదేవు నుద్దేశించి నేనొక ఘోరవ్రతం బూనితిని. అమ్మహావ్రతంబున కుద్యాపనంబు పశూపహారంబు. అయ్యాగపశు వేది యన నరుఁడు. బ్రాహ్మణక్షత్రవైశ్యసంతతులలో నొకశంకావిహీనుండును రూపసియు నగుపిన్నవయసువాఁడు కా వలయును. తల్లియుఁ దండ్రియు వడుగు నేసి వాని జంపి పాక మొనరించి వడ్డింప భవున కర్పించి పిదప నారగింతు మవ్విధి నమకూర్పఁ గలవేని భిక్షుకు కాఁ గలము.

చిరు—మహాప్రసాదము.

సీ. పరమపావనమూర్తి తిరుకచ్చిమూర్తి మా
వైశ్యవంశమునకు వర్ధనుండు
సతము మాహేశ్వరచరణసేవాసక్త
చిత్తుండఁ జిరుతొండసెట్టి నేను
నామాట జవదాఁట దేమాత్ర మేయెడ
నాభార్య తిరువేంగనాంచి సాధ్వి
పలుక నేర్చినదాది పరమేశుఁ గొనియాడు
సిరియాళశెట్టి నాచిన్నికొడుకు
గీ. భక్తుఁ డన్నట్టివాఁ డెట్టివ్రతము నైనఁ
బట్టినను గోర వ్రతమును బరిసమాప్తిఁ
జేయఁ గాఁ జూతు నని బాసఁ జేసినాఁడ
తప్పితిన యేని దిరుబాన తపసివర్య.

మాయింటికి విచ్చేసి యభ్యంగనస్నానమాచరించునంతలో దేవరయానతిచొప్పున నయ్యుపహారంబుఁ జేయించి వంటకంబు

సంపినంత నేలోపము లేకుండ సమస్తమాయత్తపఱుపఁ గలఁ
డు. శుభ మస్తు. రేపు తరలి వచ్చువారము.

హిమ—చిత్తము. (నిష్క్రమింతురు.)

---

7 రంగము హిమవంతము.

---

కోలాహలము విన నగును. సంభ్రమమున వసుభూతి ప్రవే
శించును.

వసు—అమ్మయ్య! ఇక్కడ సేరుకొనినప్పటికి నాప్రాణములు గూటఁ
బడినవి. చాలుఁ జాలు. రత్నగర్భుండును మహైశ్వర్యసంప
న్నుండును నగు హిమగిరీంద్రునేకతనయావివాహమహోత్సవ
మతివైభవముగా జరుగు ననుకొంటిని. ఏమి మగపెండ్లివారు!
ఏవంకఁగనిన జడలదయ్యములు బూడిదబూచులునే గాన
నయ్యెడిని. నగేంద్రుం డానరేంద్రు నెక్కడనుండి తెచ్చెనో
గదా! గోముగఁ బెంచి కూఁతును బాములవానిపాలు చేయు
నేల? అవును. నగేంద్రునకుఁ బన్నగేంద్ర సంబంధబాంధవ్యము
సరిపోయినది. అడుగడుగునఁ గాళ్లఁ బడిఫూత్కారంబులంగావించు
కాలభుజంగంబులును నలువంకల విచ్చలవిడిం బఱువు లెత్తినేలఁ
గయ్యంబునకుగాలుద్రవ్వుచుదిక్కులుమాఱుమ్రోయుచుం కెలిడి
వాఁడికొమ్ములగుఱిఁ జూపి బుస్సలఁ గొట్టుయాఁబోతు కోడె
లును టురంబునఁ జెలరేఁగి సంచరింప భూరిదక్షిణలు సంభావ
నలుం గల్గునని గంపెడాసతో నామడవలీల వెనక వైచి వచ్చిపడి
నభూదేవులకు నిలువ నీడ యేని లేకున్నదే! అదిగో యెవరో

వచ్చుచున్నట్లున్నది (చూచి) ఏమి శ్రీధరా! ఆజంతువు లెక్కడకుం దరుముకొని వచ్చుచున్నావా? (భయము నటించును.)

శ్రీధరుఁడు—జడియకుము. ఒక్కనిముసము మాత్రి మల్లుఁడలిగి యావేగముఁ గల్పించె నిప్పుడు సర్వమను కూలమయ్యె.

వసు—ఎట్లెట్లు? ఈమాట లేమి?

శ్రీధ—హిమవంతుఁ డనుగ్రహించినదక్షిణాద్రవ్యము, మోయలేకున్నాను.

వసు—అయ్యో! అయ్యో! మించిపోయినదా? నాకు శూన్య మేనా? వృథాప్రయాస మయ్యెనే.

శ్రీధ—ఆలసింపక వేఁ బొమ్ము. నీకును లభించును.

వసు—పాములుఁ బోతులుఁ బో నీయవే?

శ్రీధ—నేనును వచ్చెద రా వోయి. (నడచుచు) పురంబునఁ గల్గు యులజడి మాన్పు మని నగేంద్రుండు పన్నగేంద్రభూషణుని వేఁడికొనినంత సర్వము నిముసములోఁ బ్రశాంత మయ్యె నిప్పు డానవమోహనాకారుం డగుబాలచంద్రకిరీటునిం దిలకింప వేయికన్నులుం జాలవు. రాద్రిం బెల్లఁ దుగ్రిటిలో సమ్మోహనంబుగా మాటె. వడివడిపదమా.

(నిష్క్రమింతురు.)

(పురవీథి మాటలతో మరలఁ బ్రవేశించి)

వసు—శ్రీధరా! తొలి నే నేమో యనుకొంటిని గాని గిరిరాజువదాన్యత నెం తని గొనియాడఁ గలమోయి? అట్టి త్యాగశీలుఁడు గనుకనే తనపూర్వపుణ్యఫలంబునం బుత్రికకనుహూపుం డగువరుండు లభించె సరిగా వివాహసమయంబు

నకే వచ్చి యిష్టమూర్తికి సాష్టాంగదండప్రణామంబు లాచరిం
చినరతిమన్మథులం బోలుజంపతు లెవ్వరోయి?

శ్రీధ—వారు నిజముగ రతిమన్మథులే. మానవుని వేడికోలు నంగీక
రించి శంకరుండు తనకల్యాణంబున కాదికారణుం డగుకుసుమ
కార్ముకుని మఱలఁ బ్రసాదించె.

వసు—కన్యాదానసమయంబున ధీరుం డయ్యు గట్టురాఁ జెట్టులు శోక
విహ్వలుం డయ్యె! మేనకాదేవిని మించి దుఃఖింప సాఁగెఁ
బాపము.

శ్రీధ—ఆవైక్లబ్యము గృహస్థునకే గాని నీవంటిబ్రహ్మచారికే మె
ఱుకరా?

గీ. కొడుకు కొడు కౌను కోడలిం గూఁతుదనుక
గూఁతు రన్న నేకాలంబుఁ గూఁతు రగు న
టంచుఁ గూఁతును గని ముదం బందు వాఁడు
బొట్టి యను బాయలే కట్లు పొక్కు టగుదె?

(పురజనులు సందడితోఁ బోవుచుందురు.)

వసు—(ఒకనితో) ఎచటి కయ్యా, యింతఁ దొందరగాఁ బోవు
చున్నారు?

ఒకఁడు—కోటకు. ఎఱుఁగవటయ్యా? నూతనవధూవరులకుఁ బెండ్లివా
రంద ఱుత్సవాంతమున నానందనీరాజన మిత్తురు. ఆనేత్రోత్స
వముం జూడకున్నఁ గన్ను లున్నఫల మేమి?

వసు—మరల నేమైన సమ్మాన ముండునా?

ఒకఁడు—ఏమో, నీయదృష్టము.

శ్రీధ—మేమును వచ్చెదము.

(నిష్క్రమింతురు)

(వివాహమంటపమున వధూవరులును బెండ్లివారును
కర్పూరనీరాజన మిచ్చుచుందురు.)

అరుంధతి—కం. మంగళ మగుశంకరునకు
మంగళమా శ్రీతుషారమహీధరసుతకున్
మంగళ మగుమన్మథునకు
మంగళమా రతికి దివికి మంగళ మగుతన్.

8. రంగము హిమవంతునిమందిరము.

పార్వతి, యీశ్వరుఁడు ప్రవేశింతురు.

ఈశ్వ—ప్రియసీ! యేల మార్గము పట్టి పేరలుకం జెందెదవు?
(మొగముఁ ద్రిప్పఁ బోవును.)

పార్వ—చాలుఁ జాలు నీమోసము. (తమ్మిమొగడతో నతని దాకి)

చ. మనుగుడుపుత్సవంబులు సమాప్తినిఁ జెందగ లేదు మామ నీ
కనిశము వేడ్క నింప దివిజాంగన లాడగఁ బాడఁ జేయు నీ
మన మిపు డెవ్వతెం దగిలె? మన్మథుఁ గెల్చినవాఁడ వేమొ? మే
నునఁ జిరుచెమ్మట ల్వొడమె; నూల్కొనెఁ బుల్కలు నేమిహేతువో?

ఈశ్వ—ఇట్టియనుమాన మేల? ఊరకయ నాపై లీలారవింద మేసితివి. చూడుము, పుష్పాసవంబు సోఁకి కన్నుల నీరు గ్రమ్మెడిని. నామై స్సమర్పు గారణ మాలింపుము—కాంచీపురంబున వీరమాహేశ్వరాచారసంపన్నుం డగుచిరుతొండం డనుమద్భక్తశ్రేష్ఠుం డుండు. అతఁ డెంద ఱెంగలు జంగమ ప్రముఖు లేతెంచి యే నేళ నే మేమి యడిగిన నే ఁగనక యాప్సితార్థంబుల న్నను

కూర్చి యిచ్చువ్రితము గలవాఁడు. నేఁడొకఁ డేతెంచి శివ లింగాభిషేకార్థ మిక్షురసమ్ముఁ గోర నతఁడు బిరాన నేఁగి పుండ్రేక్షుదండశతంబుఁ గొని మోపుఁ గదల్ప లేక యవశుం డయ్యె. నే నానరనరసాలపరికాండతండం బొకవంక నెత్తికొంటి నతఁడును నింకొకవంక నెత్తెను. ఆభారంబున డస్సి యతఁడు సెమర్చె. నేనును సెమర్చితి. భక్తకోటికి నే వలతు నిదియుఁ దప్పిదమా ?

పార్వ—దేవా ! నాతప్పు మన్నించి యావీరశైవుం జూపవే.

ఈశ్వ—నీకుతూహల మ్మిదె తీర్చెద వానిభక్తిం బరీక్షింతము రమ్ము.

(నిష్క్రమింతురు.)

(జవనికదిగును.)

ఇది ప్రథమాంకము.





శ్రీ రస్తు.

# శివరాత్రి

ద్వితీయాంకము—సిరియాళచరిత్రము.

1 రంగము. కాంచీపురోపవనము.

(చిరుతొండశ్రేష్ఠి ప్రవేశించును.)

చిరు—(తనలో) ప్రాతఃకాలశివపూజం గావించి దేవదేవున కుపహార మిచ్చి వచ్చితి. వీరశైవసిద్ధాంతానుసారంబుగ మాహేశ్వరారాధనముఁ జేయక మాధ్యాహ్నికపూజం గావింపనినానియమము శైవుండొక్కరుండును మొగసాల కేతెంచనినేఁ డెట్లు పాలింపఁ గల్గుదునోగదా! ఏమి చిత్రము!

గీ. కడవలం ద్రిమ్మరించినకరణి వాన
మూఁడువారము ల్బోరున మొత్తినపుడె
జంగమారాధనక్రియ సాఁగెఁ గాని
రాఁడు శివయోగి యొకఁడును నేఁ డదేమొ!

ఆకసము చిల్లి వోయిన ట్లాసారమున కంతము లేక భూమ్యాకాశము లేకమై ప్రళయకాల మాసన్న మైనటులుండినదుర్దినంబుల నైతము నావ్రతంబు నిరుపద్రవంబుగాఁ గాపాడినసర్వేశ్వరుండు నేఁడు మాత్ర మన్యథా యోజించునా? ఇక్కాంచీపురంబున నెల్లప్రదేశంబుల న్వెదకియు విఫలమనోరథుండ నైతి. ఈయుద్యానంబున నాజీర్ణదే

వాలయగర్భంబున నాగంతుకు లవ్వు డవ్వుడు విడియుచుందురు. అం దును జూచెదఁగాక. (పోయి చూచి) ఓహో! యేమినాయదృష్టము! సదాశివుకారుణ్యమే. జంగమమిథునంబు గాన నయ్యెడిని.

గీ. భర్త పులికళానంబుపైఁ బవ్వళింప
భార్య పాదంబు లొత్తుచు భక్తిఁ గొలువ
మహిని వెలసినయాదిదంపతులువోలె
వెలుఁగుచున్నారు కడువయోవృద్ధు లిచట.

(సమీపించి) శరచ్చంద్రచంద్రికాసంకాశ శిరోజజటాభరులై జరాజర్జరిత దేహులై రుద్రాక్షమాలాభసితత్రిపుండ్రకుంకుమా లంకృతులై భక్తిభరితులై నేత్రోత్సవముఁ గొల్పుచున్నారు. అయ్యగారించుక రుజాపీడితులు గా నున్నారు. పాప మవ్వగా రంధలు. (ప్రకా) శరణు స్వామీ శరణు (నమస్కరించును.)

యోగి—శివో రక్షతు.

చిరు— గీ. అరయునయ్యమాకు స్మర లమ్మగారుఁ
బార్వతీపరమేశులై రుర్వియందు
వచ్చి కృపను మాగృహము పావనము గాఁగ
నాచరింపంగ వలెను లింగార్చనంబు.

(యోగి చెవు డభినయించును.)

చిరు—(ఉచ్చైస్స్వరంబున) మహానుభావా! దయచేసి మాయింట నేఁడు శివపూజఁ గావింప వేఁడుచున్నాను. అనుగ్రహింపుఁడు.

యోగి—నమశ్శివాయ. నీవంశమేది? ఏమి కులమ్ము? నీపేరు? శివ భక్తపూజాచార నిర్వహణదీక్షాతత్పరుండవే? భార్య యను కూలమై నీ చెప్పినయట్లు నడచునా? సంతానమా? నీ వాడిత ప్పనివాఁడవే? నాకోరినకోర్కి దీర్పఁ గలవే? ఊర కడిగితిమి

గాని నీవెవ్వండ వైన నేమి? వీరశైవవ్రతనిర్వాహణదక్షుం డగు కుమారుం డొక్కడుండినఁ జాలును. వేయేల? నామనోరథమ్ము విను. నేఁటి కొకవత్సర మాయె మహాదేవు నుద్దేశించి నేనొక ఘోరవ్రతం బూనితిని. అమ్మహావ్రతంబున కుద్యాపనంబు పశూపహారంబు. అయ్యాగపశు వేది యన నరుఁడు. బ్రాహ్మణక్షత్రవైశ్యసంతతులలో రోగశంకావిహీనుండును రూపసియు నైనగుపిన్నవయసువాఁడు కావలయును. తల్లియుఁ దండ్రియు వడుగు నేసి వాని జంపి పాక మొనరించి వడ్డింప భవున కర్పించి పిదప నారగింతు మవ్విధి నమకూర్పఁ గలవేని భిక్షకు రాఁ గలము.

చిరు—మహాప్రసాదము.

సీ. పరమపావనమూర్తి తిరుకచ్చిమూర్తి మా
వైశ్యవంశమునకు వర్ధనుండు
సతతము మాహేశ్వరచరణసేవాసక్త
చిత్తుండఁ జిరుతొండసెట్టి నేను
నామాట జవదాఁట దేమాత్రి మేఁయెడ
నాభార్య తిరువేంగనాంచి సాధ్వి
పలుక నేర్చినదాది పరమేశుఁ గొనియాడు
సిరియాళసెట్టి నాచిన్నికొడుకు

గీ. భక్తుఁ డన్నట్టివాఁ డెట్టివ్రతము నైనఁ
బట్టినఁ గోర వ్రతమును బరినమాప్తిఁ
జేయఁ గాఁ జూతు నని బాసఁ జేసినాఁడ
తప్పితిన యేని దిరుబాన తపసివర్య.

మాయింటికి విచ్చేసి యభ్యంగనస్నానమాచరించునంతలో దేవరయానతిచ్చొప్పున నయ్యుపహారంబుఁ జేయించి వంటకంబు

సేవకుఁడు—(తనలో) ఈఁగ వ్రాలిన నీకంత బాధ యయ్యెనే? పిల్లఁడు చావ నున్న మా కెంత బాధయో! ఈఁగలు దోమలుఁ జీమలు నన్నియు నొక్కసారి నీరక్తముఁ బీల్చి వేయరాదా? కుఱ్ఱఁడు దక్కును.

యోగి—ఓరీ! ఏమాలోచించుచుంటివి?

సేవ—(తనలో) విన లేదు కద? మధ్య నన్నుఁ జంపునేమో? (ప్రకా) స్వామీ! మీ కాఁకలి యయ్యెగా రాలస్యము సేయుచున్నా రని విచారించు చున్నాను.

యోగి—అవునురా క్షుద్బాధ మిక్కుట మయ్యె పోయిత్వరపెట్టుమా.

సేవ—చిత్తము. పోయివచ్చె స్వామీ. సిరియాళునకు వడుగు చేసి ఇదె వచ్చుచున్నారు.

సిరియాళుఁడు తండ్రి పురోహితుఁడు ప్రవేశింతురు

సిరి—(యోగి దంపతులకు మ్రొక్కి భవతి భిక్షాం దేహి భవా న్భిక్షాం దదాతు

యోగి—భిక్షకై వచ్చె మే మేమి భిక్ష వేయుదుమురా సెట్టీ వీని నేల తీసికొని వచ్చితివిరా? పుత్త్రభిక్షఁ బెట్టుదుమను కొంటివా బాపను? మోక్షభిక్షఁ బెట్టితిమిగా? (పాత్రలో భస్మము వేయును.)

సిరి—ఇదె మా కైశ్వర్యము.

యోగి—సెట్టీ, త్వరగా వంటకములఁ జేయింపుము. క్షుద్వహ్ని దహించుచున్నది.

చిరు—తాము శివపూజ ముగించు నంతలో సిద్ధ మగును.

యోగి—ఏమో నీశ్రీద్ధము. మా పూజ యన నెంత? ఒక్కక్షణము త్వరగాఁ గానిమ్ము.

(ఒక బాలెంతరాలు గిన్నెతోఁ బ్రవేశించును)

బాలెం—ఓరీ సేవకా! అమ్మగా రెక్కడ?

సేవ—ఏల ?

బాలెం—వా రెక్కడ ? నేఁడింట నెవ్వరును లేరా ? ఈవృద్ధులెవ్వరు ?

సేవ—వీరు మాపాలిటి మృత్యుదేవతలు నేఁ డమ్మగారి దర్శనము నీకు లభింపదు ఇంట మారణ హోమము జరుగు చున్నది.

బాలెం—మారణహోమమా ?

సేవ—నరయాగము—నీకేమి కావలయు ?

బాలె—నాపిల్లని కిన్ని పాలను బోయింపుము.

సేవ—చెప్పి చూచెద నుండుము. (పోయి వచ్చి) వచ్చుచున్నా రుండుము.

యోగి—ఓరీ! మధ్య నీపెత్తన మేమిరా? అటు నిటుఁ దిరుగుచుండవు వినరుమా. నిమున మూరకున్న మాకు బాధ.

బాలెం—ఆమె యొండలకో వలయుక్షీరముల నిచ్చు నఁట. పిల్లలపై నెంతప్రేమ! ఆఁకలి కోర్వలేక పిల్లఁ డేమ్చుచున్నాడు. ఆలసించినఁ జనివాఁ డేమగునో, వేగఁ దెప్పింపుమా.

సేవ—ఆమె పిల్లనికంటె నీపిల్లఁ డెక్కువా? ఆగుము. నేఁ గదిలిన వీఁడు కోపించును.

(తిరువేంగనాంచి ప్రవేశించును.)

తిరు—అమ్మా! నిముస ముండుము. పాలు కాఁగుచున్నవి.

బాలెం—ఇదే మమ్మా? ఇంక నుండు మనెదవు? ఇదేనా నీశిశు వాత్సల్యము. తెలియ నైతి. లేకున్న లే వని చెప్పరాదా? పిల్లి తాగెను. ఆవు తన్నె ననఁ గూడదా? వేయొకచోటికిఁ బోమెదనే. ఆఁకలి కేడ్చి శిశువు సొమ్మసిలి యుండవచ్చు.

తిరు—అయ్యో! యేటి కీనిష్ఠురములు?

బాలెం—నిజ మాడిన నిష్ఠురమా ? ఆఁడుదానవు. పిల్లలపై మోహ

మెఱుంగుదు వని వచ్చితిఁ గాని యూర వాడవాడల నంద ఱనుకొనుచున్నది నిజమే. కొడుకు నే జంపికొన నెంచితి వఁట ?

తిరు—అది యొక మార్గము. ఒక యోగవరుండు కోరికొనెను.

బాలెం—వానియాగమో రోగమో? సిసువతికొడుకు గాబోలు? అట్లయిన శని విరుగడగును లే.

తిరు—కాదమ్మా ఔరసుఁడే

బాలెం—అమ్మా! మధుపానమత్తుం డగు మాయాయోగి కోరినంత నే కులవర్ధనుండగు కొడుకుం జంపికొందు వే? యౌను. నెంపురుడైన దీక్షనిరసువున కేనట్టి తాపత్రియ మందుచుంటివో! బాలారిష్టంబులం గడచి పెరిఁగి విద్యావినయశీలుండై కులాచార సంపన్నుం డగుపుత్రియునాదనుం గులాంకూరంబును నెట్లవై గరకరఁ గోయుదువే? నవనిధిసిద్ధికై సిద్ధు లెన్నిమాయలఁ బన్నెదరు, నీ వెఱుఁగవు. నీకుఁ గొడుకేటివాఁడు? మగవాఁడో మార్విరో యనుమాట వ్యర్థ మగునా? వాఁ డెఱుఁగఁడు గాని నీవేఱుఁగవే యాఁడుదానవు? కడుపారం గని పెంచినదానవు నీ వెట్లొప్పుకొంటివే? గాటుసివే! నేనే నైన మగనిం జోగినిం గూడఁ జావఁ గొట్టి సాఁగనంపి యుందును.

తిరు—ఇందుఁ గలతత్వ మీవెఱుఁగవు.

బాలెం—కన్నకూనం జంపికొను తత్వము నాకే మెఱుక?

(చందనికపాలు తెచ్చి పోయును.)

తిరు—తల్లీ! చిన్నదానవు. విను.

ఉ. బాలశశాంకమౌళి తనభక్తులఁ బ్రోవఁగ నెంచి యుర్విఁ దా
నీలఁ జరించుచుండి [illegible] తేజము [illegible]

కేల శివార్థ మీాతనువు లీయక? చింతిలె దేల? వేగ నీ
పాలను గొంచుc బోయి పసిపాపనియాcకలిc దీర్చిప్రోవవే.

బాలెంతరాలవు. పాలు చేcపువచ్చు నింటికి కేగుము. పాప
డెంతవాడియుండునో! ఈపాలు చాలును గదా? మాయిం
టికి వచ్చుచుం బోవుచుండు మహాత్మ నలయునంత క్షీరముc
గొంపోవు సది. నిండుకొనియుండు మహాత్మ.

(నమస్కరించిలోనికిc బోవును.)

బాలెం—కొంచె మైన జంకుcగొంకు లేదు. ఇంకేటి పరీక్ష ?

(నిష్క్రమించును.)

యోగి—సేవకా ! సెట్టిం బిలువుము.

సేవ—చిత్తము. (పోయి చిరుతొండనితోc బ్రవేశించును.)

యోగి—ఓరి మూఢుcడా! ఏమీాయాలస్యము? నీభార్య యిందనుక
నిక్కడ నొక్క మచ్చెకంటితో ముచ్చటలాడుచుండెనే? ఇంట
నీ వేమి చేయుచుంటివో ? ఆcకలి దుర్భరము రా.

చిరు—యాగపశువు నేయుచుంటిని. మీాయాజ్ఞ నిట వచ్చితిని.

యోగి—ఏపశువు నేయుచుంటివిరా, పశువా? నాపరోక్షమున గొఱ్ఱె
యను మేకను జంపరు గదా ?

చిరు—యోగీంద్రా! ఇదె నాసుతుం దెచ్చి తమసమక్షమున నే వధిం
తు. (పోయి కుఱ్ఱనితో, భార్యాచందనికలతోc బ్రవేశించును.)
నాయనా, సిరియాళా!

ఉ. పాశుపతవ్రతమ్ము పరిపాటి ముగింపc గృపామయుండు యో
గీశుcడు భూతి నిచ్చి మన కింతటిపున్నెముc గూర్చె మోహపుం
బాశముc ద్రెంచి నీపలుకుc బాకముc జేయcగ నెంచినార మే
క్లేశముc జెంద కిక శివలీనమనస్కత నుండు మర్భకా !

సిరి—తలిదండ్రులారా ! నామది నెట్టిక్లేశమును లేదు. స్వస్థచిత్తులై నన్నంపి యోగివర్యునకు వేగఁ బారణ మొనరింపుఁడు.

గీ. శివుఁడు శివయోగియై న్వైద మవనిఁ గలదె ?
శివుఁడె కర్త, శివుఁడె భోక్త, శివుఁడె శాస్త
మనశరీరార్థజీవమ్ములను గిరీశు
వని యెఱింగియు మది నేల వనటఁ జెంద ?

యోగి—ఈయుపోద్ఘాత మేలరా? నీ శాఁకలిదప్పు లుడిగినవి. మేము మాత్రము చచ్చువారము. ఎంతనిచెప్పుదును?

చిరు—(భార్యతో) బుడుతని నీయొడిలోఁ గూర్చుండఁ బెట్టుకొమ్ము.

తిరు—నాయనా ! ముద్దుపట్టీ, రావోయి (కూర్చుండఁ బెట్టుకొని) దేవ దేవా !

గీ. చంద్రశేఖర! భూతేశ! శరణు శరణు
హరహరా! భవ! భవహర! శరణు శరణు
గిరిశ! సచ్చిదానందాత్మ! శరణు శరణు
స్మరణముం జేతు నోదుఃఖజలధిసేతు !

(ధ్యానతత్పర యగును.)

సిరి—తల్లీ !

గీ. శాశ్వతం బైనకీర్తి విశ్వమున నిల్పఁ
వలయు మనుజుఁడు తనువు నశ్వరము చావు
నేఁడో రేపో మఱేనాఁడో నిశ్చితంబ
మైహికార్తిని విడి మోక్ష మంద వలదె ?

అమ్మా నీవెఱుఁగనిధర్మంబు లేవి కలవు? ఏల దిగు లొందెదవు ? ఈలోకంబున సర్వంబు మిథ్య యని దెలియవే ? "ఋణానుబంధరూపేణ పశుపత్నీసుతాలయాః" ఋణముఁ దీర్చి కొన నాయూరూపములందుచున్నాము. ఇది యంతయు భ్రాంతి.

నీ వెవరికతవో నే నెవఁడనో? "మాతా నాస్తి పితా నాస్తి నాస్తి బంధు స్సహోదరః అర్థో నాస్తి గృహం నాస్తి తస్మా జ్జాగ్రత జాగ్రత" యనుతత్త్వ మెఱిఁగి మనము ప్రవర్తింప వలయును. శాశ్వతశివసాయుజ్య మందుచున్నాను. తండ్రీ! జాగు సేయుకుము.

తిరు—నాయనా! చిరుత వాఁడ వయ్యు నెంత విరాగి వైతివిరా? మాకు వైరాగ్యము నేర్పుచుంటివే! నిన్నుఁ గని ధన్యుల మైతిమి.

గీ. తల్లిదండ్రులు కరము నిర్దయు లటంచు
మమ్ము దూషింప కోసుకుమారగాత్ర!
తొల్లి పున్నామనరకముం దొలఁగఁ జేసి
మావ్రతముఁ గాచి నావె కుమార యిపుడు.

నీవెనువెంటనే మేమును వచ్చు నారము.

చిరు—సిరియాళా! వీరశైవవ్రతా! నా వ్రతపరిపాలనభారము వహింపుము.

సిరి—తండ్రీ! మీయానందముకంటె నాయానంద మేది? తప్పక దేవదేవుఁడు మనలఁ గైవల్య మిచ్చి ప్రోచును. కానిండు. అమ్మా నాతుదివిన్నప మాలింపుము. ప్రియోపవేశ మొనర్చుకుము.

సీ. ఘోరవ్రతం బూని భైరవయోగి నర
జంపించె నంచు నిందింపకమ్మ
వ్రతము లటంచుఁ గొంపం గూల్చినాఁ డని
జనకుపై నెన్నఁడుఁ గినియకమ్మ
శివయోగిపరిచర్య చేటుఁ గూర్చె నటంచు
మాహేశ్వరుల సేవ మానకమ్మ

పుత్త్రశోకార్తిని బొగులుచు నేనేళ
మదనారిపూజల మఱువకమ్మ

గీ. లేమ సిరియాళుఁ డనువాఁడు లేని లేమ
పొడమినట్టిఁడె నాగేశ్వరుఁడును నీకు
నాహితుం డాతఁడె చెప్పు నాకు బదులు
నమ్మ మతఁడె నమ్మఱపించునమ్మ మిమ్ము.

శరణు, సెలవు. చిన్నతనమునుండి కన్నతల్లికన్న నెక్కుడు ప్రేమతోఁ బెంచినచందనికా! శరణు. తలిదండ్రులఁ గాపాడునది. సెలవు. తండ్రీ! ఇం కేల జాగు సేసెదరు? ఇదె నా తుదిశరణు.

యోగి—ఓరిముముక్షూ. మరల నీయుపన్యాసము లేలరా? ఒక్కనఱుకు నఱుకరా.

చిరు—కుఱ్ఱని కొక్కపలుకు సెప్పి ముగించెద స్వామీ తనయా! నీకుఁ జెప్పవలసినది లేదు. నీభక్తినిరతి నే నెఱుఁగుదును. అయిన విను—

సీ. సంసృతిపై వాంఛఁ జాలించి భక్తిమై
శ్రీకంఠుపై నీదుచిత్తముంచి
మాపైని గురులపై మమకారమును వీడి
సాయుజ్యపదవి నిశ్శంకఁ గోరి
వైక్లబ్యమును మాని స్వాస్థ్యమ్మున నిమీలి
తాక్షుండ కీవుఁ బ్రత్యక్షుఁ జేసి
వీరశైవాచారసార మెఱిఁగి భవు
శరణార్థి యాచు హస్తముల మోడ్చి

గీ. యల్కఁ బూనక మాపైని నాల్కతుదిని
మహితపంచాక్షరీమహామంత్రజపము

నలుపుచుండుము కదులక చంద్రహాస
మిదిగో ఖండించు శిరము నీ వెఱుంగకుండ.

మహాదేవ! (ఖడ్గ మెత్తును. అవ్వ మూర్ఛిల్లును )

యోగి—చచ్చె నాభార్య చచ్చె! మీయాలస్య మింతకుఁ దెచ్చె.

(ఉద్యమము నిల్పి యందఱు ఆమె నుపచరింతురు.)

చిరు—సేవకా! ధన్వంతరిం బిలువుము.

యోగి—వాఁడు వచ్చులోపల నీమె చచ్చు ననియా! ఉపచారములఁ జేయరా పాపీ ! నాప్రేళ్ళకుఁ బట్టు తగులదు.

(అవ్వ మెల్లగ లేచి కూర్చుండును.)

పాప మాఁకలి కోర్వ లేక పోయినది. మా బాధ మీ రెఱుఁగరు. మీరు చీమ కుట్టిన ట్లైన లేదు తెలియక మోసపోతిమి. ఇంత చేతవాతఁ గానిపెద్దమ్మ వేల మమ్ముఁ దెచ్చితివి. ఈవఱకు భుజించి హాయిగఁ బండుకొనియుందుమే. ఆలసించిన నీలో మేముచత్తుము, కుఱ్ఱఁడు బ్రతుకు నని యెంచితిరో!

చిరు—ఇదిగో శిరము ఖండించువాఁడ. (సిద్ధమగును.)

యోగి—ఈనీసుతవధం జూడఁ జాలక తప్పింతు మనియా యీగోల నిక్కడఁ బెట్టితివి; లోనికిఁ బొండు. త్వరగాఁ గానిండు.

చిరు—చిత్తము స్వామీ.

(అందఱుఁ లోనికి బోవుదురు.)

యోగి—చూచితే, దేవీ, యెంతటిభక్తిపారవశ్యమో! కంటఁ దడి యైన లేదే.

యోగిని—సరిసరి, శిరముఁ ద్రెళ్ళ నేసెను!

యోగి—నమశ్శివాయ యనుచు శిరము చందనిక చేతులలోఁ బడెను. ముఖము కంద లేదు. గాజు వారలేదు. మందహాసచంద్రికలు

మేలు మాడుచున్నవి! దంపతు లానంద భరితులైరి. ఇట్టిది గదా దృఢభక్తి?

యోగిని—ఇంక ప్రత్యేకముల మవ్యేదమా?

యోగి—ముందున్నదే మనుష్యపంపుగ. (బిగ్గరగా) ఓరీ సెట్టీ!

(సెట్టి ప్రవేసించును.)

తీవ్రమగు తాపము గన్నదిరా. ఇంతపానకమైన దెప్పింపుము

(సెట్టి తెచ్చియిచ్చును. యోగులు త్రాగుదురు.)

ఓరీ! నాపుండ్లు బిగ బట్టుకొని పోవుచున్నవిరా. మంట అబ్బా! బాధ మిక్కుట మయ్యెం గదుల లేను. గంధ మింత పూయరా, చూచెదేమి? (సెట్టి గందము తెచ్చి పూయును.) మెల్లగ నలదుము. సరి నీవింక విసరుము నీసేవకునివలనం గాదు. (సెట్టి విసరును.) అయ్యో? జఠరాగ్ని కాల్చినట్లు వలె నుదరగోళ మును గాల్చుచున్నదిరా కాళ్ళులాగుకొని పోవుచున్న వించుక నొత్త రాదా? (సెట్టి సంవాహనముం జేయును) చంద నికం బిలిచి నాభార్యకుం గా ళ్ళొత్తింపుము.

చిరు—చిత్తము. (చందనికం బిలచి) అమ్మవారికిం బాదసేవ చేయుము.

చంద—చిత్తము (అవ్వగారి కాళ్ళొత్తును.)

యోగి—అన్నన్నా! నొప్పిరా పుండ్లంజూచి మెల్లగ నొత్తుము. గంద మూడ్చి వేయుచున్నావే? అయ్యో! మరల నుడుకులెత్తు చున్నవి.

చిరు—మరల గంధము బూయునా స్వామీ.

యోగి—చాలు నీసేవ; యేడ్చినట్లే యున్నది పో వేగ వంటకముంజే యింపుము.

యోగిని—చందనికా నీవును బొమ్ము. భోజనము పెట్టింపుము.

చంద్రి—(లోనికిం బోవును.)

చిరు—దేవా ! శివపూజఁ గావించితిరా ?

యోగి—మ తేమి పూజరా ? ఉదరపూజ యే.

(తిరువేంగనాంచి ప్రవేశించి)

తిరు—పంటక మయినది. యోగీశ్వరులింక దయ నేసియారగింపవచ్చు.

యోగి—అమ్మయ్యా ! ప్రాణము లు నిలిచినవి.

(నిష్క్రమింతురు.)

—భో జ న శా ల—

(యోగు లుపవిష్టులై యుందురు. తిరువేంగనాంచియుఁ జందనికయు) వడ్డింతురు. సెట్టి పీవనతో విసరుచుండును.)

తిరు—నానావిధభక్ష్యభోజ్యచోష్యలేహ్యపానీయంబులతో సుతుపాల మేలువంటకంబులఁ జేసి భరితభోజనంబుగా వడ్డించితిమి. అమ్మ తాహారం బారగించి రక్షింపుఁడు.

యోగి—(వేర్వేఱఁ బదార్థంబులఁ బరికించి) ఛీ! ఛీ! నిజపుత్త్రవ్యామోహ మిట్టిదే కదా ? బాలకు నుత్తమాంగంబుకూరలు సేయ రైతిరి. అధమాంగమాంస మెట్లు భుజింతుము ? తలం జూచి యైన దనయునిమీఁది వలపుఁ దక్కించుకో నెంచితిరో? సర్వస్య గాత్రస్య శిరః ప్రధాన మ్మనుమాట వీటిఁబుచ్చితి రే? నావ్రతము భగ్న మయ్యె. యాగము దగ్ధమయ్యె. ఇఁ కేటి పారణము? చాలు, చాలు, దేవీ, లెమ్ము. (లేవఁ జూతురు)

చంద—స్వామీ తాళుఁడు, కేశపరీతదుష్టపాకం బనర్హం బగు నని వడ్డింప నైతి. ఇదె తెచ్చెద. వండి యుంచితిమి. (తెచ్చిపెట్టును)

యోగి—సంతోషము ! సంతోషము ! ఇప్పుడు గదా మావ్రతము సాంగం బయ్యె. భళీ ! ఇల మిముఁ బోలునన్నదాతలు లేరు. ఏనాఁట నీ నేట నృపతిమానం బగునభీష్టాన్న అన్నప్రదానంబుఁ

జేసితిరి—మే మీపలపటను మీరు దాపటను గూర్చుండి యిష్టలింగార్చనంబులం జేసి కడుపార నారగింతము రండు. ఒక్కఁ డెన్నఁడు భుజించు టొప్పదు. పంక్తిం బ్రియమగు లారగింపక భోజనము నాకుఁ జే యూడదు. త్వరగా రండు. ఆఁకలి.

చిరు—మహాత్మా! మీ యోగసిద్ధి యైనది గదా? తమ రారగింపుఁడు. ఘాతకమృగము లట్లు కన్నకూనలం జంపి తినఁ గలమా? క్షమింపుఁడు.

యోగి—అట్లయిన సరియే. ఇచ్చఁ జేసినమాంస మిచ్చితిరి. మీ రిచ్చినది మరల మీకే విడిచెదము. మే మేఁగెదము. (పోఁ బోవుదురు)

తిరు—ఇంచుకఁ దాళుఁడు స్వామీ. (భర్తతో)

క. సిరియాళుని మీరలు మీ
కరములచే ధృతిఁ గరకర ఖండించితిరే
పరిపరివిధములఁ బాక మొ
నరిచితిఁ దినఁ జాల మంచ సంగం జనునే?

రండు, యోగీశు లానందింపనిండు. (దంపతులు గూర్చుండుదురు. చందనిక వడ్డించును.)

యోగి—అది సరి గాని—

చిరు—ఇఁక నేమి సెలవు స్వామీ?

యోగి—అతిథిపూజావసరంబుల నుత్తము లుత్సకత సుతులపొత్తునం గాని భుజింపరు. నీకుం దిన నోటి కెటు పోవును? కనికరం బింతయు లేక పసిబిడ్డల కిడక యింట నేమేని వండి తామే భుజించు తలిదండ్రు లెం దైనఁ గలరే? నీసుతు లేడ? వారిం బిలువుము.

చిరు—

మ. అకటా వండగ లేదె మాతనయు నిర్వ్యాగార్థమై చంపి నే
  డాకపుత్త్రింపఁ గలా డటంచుమదిలోనూహించుచున్నారొ? మా
  మకశీరాళుని బుత్త్రిమోహమున నీమంబుం జెఱం గొట్టి మే
  మొకచోటం బదిలంబుగా నునిచి నావో యంచు మీ రెంతురో?
  వాఁ డాడుకొనుచున్నాఁ డని పిలుతునా లేక చదువుకొను
చున్నాఁ డని యా ?

యోగి—అయ్యయ్యో! చెడితిమి. అపుత్త్రస్య గతి ర్నాస్తి యందురు. గతిహీనునింట సంయములు గుడుతురే? మగబిడ్డలు లేని నిర్భాగ్యునింట భుజింప రాదు. పుత్త్రుఁ డున్నఁ బిలిపింపుము లేనినాఁ డీపాక మొల్లము.

చిరు—మహాత్మా! మీ రిట్లాడఁ బాడియే? శాకపాకములుఁ జల్లనా రనే! శీఘ్రి మారగించి మమ్ముఁ జరితార్థులఁ జేసి రక్షింపుఁడు.

(భార్యాభర్తలు నమస్కరింతురు)

యోగి—(అవును గాదనక) సెట్టీ! నీభార్య యెలుం గెత్తి పిలుచునది. తల్లి పిలిచిన రానితనయుం డుండునా? వచ్చినఁ బంక్తిం బెట్టు కొని భుజింతము.

చిరు }
తిరు } —మహాప్రసాదము.

తిరు—గీ. రార! వైశ్యకులోద్ధర! రార ధీర!
  రార నిస్సారసంసారదూర! శూర!
  రార కందర్పసుందరాకార రార!
  రార ముద్దుశీరాల కుమార! రార!

(సిరియాళుఁడు పలికి పరుగెత్తి వచ్చి యోగీశ్వరులకుఁ బ్రణమిల్లి తలిదండ్రులఁ గౌఁగిలించు కొనును.)

యోగి—ఓరివంచకులారా! ఎంతమోసముఁ జేసితిరిరా? మాకే నీచమానవమిడితిరి? మాకన్నులకే గంతలు వేసితిరే ఛీ! మీ మొగములఁ జూచినఁ బాతకమురా. దేవీ, లెమ్ము. (పోఁ బోవుచురు)

చిరు—మహానుభావా!

గీ. చేతులారంగఁ జంపిన చిఱుతవాఁడు
మగుడి బ్రిదుకుట మీ మహిమమున గాదె?
భక్తులను బరీక్షించి బ్రోవంగ భువిని
సంచరించు నుమామహేశ్వరులె మీరు.

(అందఱు మ్రొక్కుదురు.)

యోగి—ఛీ! ఛీ! నోరు మూయుఁడు. మీస్తోత్రమున్న నుబ్బిపోము. ఎంతటి కపటమురా?

చిరు—యోగీశ్వరా! శాంతింపుఁడు. అనుగ్రహింపుఁడు. మీ మన్నతమాడ లేదు. ఏమోస మెఱుఁగము. మావిషమపరీక్ష మాని రక్షింపుఁడు. యోగీశ్వరరూపమ్మున మమ్మనుగ్రహింప వచ్చిన పార్వతీపరమేశ్వరులయ్యు నీయాగ్రహ మేల? మమ్ముఁ బ్రోవుఁడు.

యోగి—ఏమేమి? మీచేసినమోసమునకు క్షమించి రక్షింపవలెనా, భక్షింప వలెనా? ఇదె శపించెదఁ గాక.

చిరు—భక్తవత్సలా! శరణు. ఇదె మీసమక్షమున నాసుతు న్మరల వధించి యోగిరముఁ బెట్టించెద. తాళుఁడు.

(తిరిగి వధింప సిద్ధుఁ డగును.)

(పార్వతీపరమేశ్వరులు సాక్షాత్కరింతురు.)

ఈశ్వరుఁడు—వలదు. వలదు. మెచ్చితి. మీభక్తి ఏమి కావలెనో కోరికొండు. (అందఱు సాష్టాంగనమస్కారములఁ జేతురు.)

చిరు—మర్త్యుల కట్టివారికిని దుర్లభం బగుమీాదివ్యదర్శనం బిచ్చి మ మ్మనుగ్రహించితిరి. మేము తరించితిమి. ఇంకేమి కావలయు? అయిన—

గీ. మించి కరుణాబ్ధి మమ్ముఁ దేలించినారు!
కంచి నేడువాడలకును గరుణ నించి
సచ్చిదానందకైవల్య మిచ్చి ప్రోవ
వేఁడెదము వారు మేమును వేఱు గాము.

ఈశ్వ—మీాజన్మాంతమం దట్లగును గాత.

చిరు— కం. మంగళము భక్తవరులకు
మంగళ మీాశులకు భక్తమందారులకున్
మంగళము శైవదీక్షకు
మంగళము శిరాలువరకుమారునకు నగున్

## 5 రంగము కైలాసము.

(పార్వతి, ఈశ్వరుఁడు ప్రవేశింతురు.)

పార్వ—దేవా! చిరుతొండశ్రేష్ఠివంటిభక్తవరు నెందుం గానము. ఏమి యాశ్చర్యము!

గీ. ఏడిమొల్లినఁ గష్ట మదెట్టిదైన
వారిప్రాణము ల్సయితము ధార వోతు
రంతియే కాని వ్రత మిసుమంత కొఱఁత
వడిన సహియింపఁ జాలరు భక్తవరులు.

తిరువేంగనాంచియు వానికిఁ దగినయిల్లాలే. కుఱ్ఱఁ డిరువురమించినాఁడు. ప్రమథామణులలో నట్టి దింకొకతె యున్నే?

ఈశ్వ—లేకేమి? మఱచితివో మనల నిరువుర నొక్కరీతిఁ బూజించు చిత్రవర్మరాణ్ణందినిని;

ఉ. స్వాంతమునందు భూమిసురజంపతుల న్శశివాసరప్రదో
షాంతరమందు న న్మన మటంచు దలంచి భజించి సాధ్వి సీ
మంతిని సేయదే నిరుపమానముగా వ్రతపాలనమ్ము న
భ్యంతర మేమి కల్గిన నపాయముఁ జెందదు నీమ మెందునన్.

పార్వ—అవు నవు నామెను మనము ప్రోవవలదా?

ఈశ్వ—ఇంచుక నొక్కలీలగా నామెం బరీక్షించి ప్రోవుదము. అల్లదె చూడు మామె భర్త చంద్రాంగదుండు చెలికాండ్రం గూడి యమునాతరంగిణిని నౌకావిహారము సేయుచున్నాఁడు. ఒక్కసుడిగాలిఁ బంపి యాపోతముం బోర్లఁ ద్రోచి చూతము.

పార్వ—అయ్యో! ప్రాణాపాయముఁ జేయవుగద?

ఈశ్వ—చెక్కు చెదరక పాతాళలోకముఁ జేర్చెద రమ్ము.

(నిష్క్రమింతురు.)

జవనిక దిగును.

ఇది ద్వితీయాంకము.





శ్రీరస్తు.

# శివలీల

తృతీయాంకము—సీమంతినీపరిభావము.

I రంగము. ఆర్యావర్తపురము.

(చిత్రవర్మ మంత్రి ప్రవేశింతురు.)

చిత్ర—హా చంద్రాంగదా! ఎంతపని చేసితివిరా!

సీ. అమితిగా నౌకావిహారంబు సలుపంగ
నీనాఁడు వేడ్క నీ కేల కలిగె?
తాళమానమ్ములౌ తరఁగల నెగఁయుమ్ము
నీసుడిగాలి తా నేల వచ్చె?
కూడి యాడెడునీదు వేడుక చెలికాండ్రు
దరిఁ జేర నీ వేల దరికి రావు?
యానపాత్రముఁ దేల్చు యమునానదీజల
పూరమ్మునకు నీవ భార మైతె?

గీ. నిన్ను నిర్దయ కాళిందినీట ముంచి
యప్పుడే మ మ్మపారదుఃఖాబ్ధి ముంచె
లేదు నీయట్టిఁ డేడ ని న్నెట్లు మఱతు?
గాంతువైధవ్య దుఃఖ మేరీతి నణఁగు?

గీ. ప్రాణుల న్బట్టి హింసించుపామునితోడఁ
బుట్టు వాయువ యాతనిఁ బోల కున్నె?
అట్టియమునకుఁ గనికర మెట్లు లుండు?
కడుపున న్బుట్టుకొన్నదే కొడుక నిన్ను!

ఉ. నిక్కము దాప కొక్కధరణీసురుఁ డాడిననిష్ఠురోక్తి య
మ్మక్క నిజం బటంచు నణుమాత్రయు భీతిని జెంద నైతి నా
మక్కువఁ జూచికొంటి బుధమాన్యుఁడ యాయువు నెంచ నైతి ని
న్దక్కఁగఁ బట్టి మ్రింగుయమునానది యంచు నెఱుంగ నైతి హా.

మనోజయుంతు మాండవ్యః యని శకునంబుల సైతము లెక్క సేయ కుంటి. నవమన్మథుం బోలునీమోహనాకృతి నాకన్నులఁ గట్టితివి. ని న్నెట్లు మఱతు? నీసుగుణగణంబులం దలఁచుకొన్నకొలఁది హృదయవిదారణ మగుచున్నదే! మ మ్మందఱ నీతో వాహ్యాళిఁ గొంపోయిన నీయెడఁ బాటు నెఱుంగకుందుమే?

అమ్మా సీమంతినీ! శతవర్షంబు లైదువతనంబున సమస్తసౌభాగ్యంబు లనుభవించి సుఖింతు వం చలనాఁడు జ్యోతిష్కు లాడినవాక్కు లిక్కరణి నయ్యెఁగా! సుగుణాలదొంతి వగు నిన్నుఁ గోడలిఁ గాఁ బడసి పొంగిననీయత్తసంతస మింతలో నంతరించెగా!

ఉ. అమ్మరో! నీవు నీపతిగృహమ్మున కేఁగెడివేళఁ దూర్యరా
వమ్ములు మిన్నుముట్టగను వారవధూటులనృత్తగీతవా
ద్యమ్ములతోడ మిమ్ము నరదమ్మునఁ బంపఁ దలంచి యుంటి వ్య
ర్థమ్ములఁ జేసెఁ గోర్కులను దైవ మిఁ కెవ్వరిఁ బంపెదే సుతా.

మంత్రి— దేవా! ఊరడిల్లుఁడు. సర్వధర్మము లెఱిఁగినతము రే యిట్లు
[illegible]

ర్చు వారెవరు? ధైర్య మవలంబింపుఁడు. తనువులు జలబుద్బుదప్రాయములు. సిరు లస్థిరములు విధికృతం బవిలంఘ్యంబు. శోకము దిగమ్రింగి రాకొమరిత నూరార్చుఁడు.

(తెరలో "అయ్యో సీమంతినీ" యను ధ్వని.)

ఇరువురు— ఏమది ? (తొందరగా నిష్క్రమింతురు.)

అగ్నికుండమున నురుకనున్న సీమంతినిని జెలులు వారింపుదురు.

(చిత్రవర్మ మంత్రి ప్రవేశింతురు.)

చిత్ర—అమ్మా వలదు. ఏల యిట్టి తెగువఁ బూనెదవు? నీభర్త నీళుల మునింగినంత నసువులు నీల్గెనని యెంతువా ? మహాదేవుకరుణను మరఁడిరాఁ గూడదా? వరుణలోకమున కేగిన వారెందఱు మఱలి రాలేదు ? పార్వతీపరమేశ్వరారాధన తత్పరవైన నీ చేయు మహావ్రతమ్ములు వమ్మగునే ? కొంచె మోర్చికొనుమది. తల్లీ ననుఁజూడుము. నీవు లేకున్న నాకింకెవరు దిక్కు? నేను గూడ నగ్నినురికెదను సుమా.

సీమ—తండ్రీ మన్నింపుము. నన్ను వారింపకుము. ఈలోకము నాకింక శూన్యమే. ఈవ్యర్థజీవిత మెందులకు?

(అగ్ని నాజ్యము వోయుదురు.)

హాజనకా! హతవిధి నన్నన్నివిధంబుల నిర్భాగ్యం జేసివైచె. ఆజ్య మెంత వోసిన వీతిహోత్రుఁడు ప్రజ్వలింపఁడే! వీనికిని నాపై నక్కటికము లేకపోయినది. యమునయే నాకింక దిక్కు.

(మైత్రేయమహర్షి ప్రవేశించు. అందఱు నమస్కరింతురు.)

మైత్రే—శుభ మస్తు. (సీమంతినికి) సౌభాగ్యవతీ భవ !

చిత్ర—మునితిలకా ! ఇం కేటిసౌభాగ్యము ?

మైత్రే—నే నెఱుఁగక పోలేదు. మీ రెవ్వరు నివ్వెరపడవలదు. (సీమంతినికి) సాధ్వీమణీ! యోగదృష్టి నెఱిఁగి నీతెగువ న్మాన్ప వచ్చితిని. ఇందుశేఖరు కరుణాకటాక్షావలోకనముఁ జూరఁగొన్న నీ కేకొఱంతయు రాదు. నామాట నమ్ముము. ఈజాతవేఁదుఁడే సాక్షి. ఈశ్వరేచ్ఛ వెల్లడించినాఁడు.

సీమం—ఋషిసత్తమా! తామెంత సెలవిచ్చిన నామది కూరట కలుగకున్నది. జ్ఞాన మెఱిఁగిన దాద సాంబశివునే గొల్చుచుంటి. వారియాజ్ఞ యిట్లున్నది. నానాథుఁ గలసికోవలె.

మైత్రే—అమ్మా! నామాట ముమ్మాటికి నిజము. నీపట్టిన వ్రతమాహాత్మ్య మెఱుఁగవో? వినుము—

సీ. పరిపంథిచేఁ బరాభవ మందువానికి
 స్థిరమైనజయపరంపర నొసంగు
సంతానరహితుఁడై చింతించువానికి
 గతి సీయజాలునంతతి ఘటించు
దారిద్ర్యమున జిక్కి భూరికష్టం బందు
 వానికి నిత్యసంపత్తిఁ గూర్చుఁ
బతివియోగంబున నతిదైన్యమునఁ గుందు
 లలనకు భర్తృవాల్లభ్య మిచ్చుఁ

గీ. గామితార్థమ్ములను గూర్చు కల్పతరువు
సుమ్ము పుడమి నీశ్వరులను నమ్మికొలుచు
భక్తులకు నెందు వానరపత్రము గాన
దాని బాలింపుము నియతిఁ దప్పకుండ.

చ. ధురిని మునింగె నాథుఁ డని వంతత మీవు విచారసాగరాం
తరమున మునుగ కమ్మ, నపరమ్ము వ్రతమ్మును సల్పు మమ్మ పు

స్థిరముగ నీశుపాదసరసీరుహముల్ మది నిల్పు మమ్ము నం
బరమున శంకరుండె కృప భర్తను గూర్చి శుభమ్ము లిచ్చెడిన్.

సీమ—చిత్తము స్వామీ. దేవదేవా !

మ. భవితవ్యం బెటు చేయనెంచితివో ? యాపద్వారవారాశి న
న్నవలీలం దరియింపఁ జేయ నిఁక నీయంఘ్రిద్వయం బొక్కటే
శ్లనమంచు న్మది నమ్మియుంటిని కృప న్బాలించి దీనావన
ప్రవణోదార మహామతీ పశుపతీ! రక్షింపవే శ్రీసన్నిన్.

మైత్రే—శుభం బగుఁ గాత ! నేఁ బోయి వచ్చెద.

(అందఱు నమస్కరింతురు.)

అభ్యుద యోస్తు. (సీమంతినికి) దీర్ఘ సుమంగలీ భవ.

(నిష్క్రమించును.)

చెలికత్తె—చెలీ! శివపూజాసమయ మయ్యె రమ్ము.

(ఆమెను లోనికిఁ గొంపోవును.)

చిత్రి—అమాత్యశేఖరా! మైత్రేయులవారు మనకులము నుద్ధరించి నారు.

మంత్రి—నిశ్చయమే. సీమంతినిని వ్రతముల న్మాంచి దుఃఖమును మరపించుటే మన కిఁకఁ గర్తవ్యము. తమకును బూజాసమయ మయ్యె. దయసేయుఁడు.

(నిష్క్రమింతురు.)

---

2 రంగము. పాతాళలోకము. గంగాతీరము.)

---

చిత్రరేఖ శశికళ ప్రవేశింతురు.

చిత్ర—సఖీ, శశికళా! గంగాతరంగడోలికల నూఁగి యూఁగి మెల్లన తోఁతెంచుసమీరకిశోరములు మన కమందానందంబుఁ గూర్చుచున్నవే.

శశి—మెత్తనిపట్టుపాన్పుం బోలుస్వచ్ఛసికతాతలంబుల నిం దించుక విశ్రమించి వేదఁ దీర్చికొందమా?

చిత్ర—నా కించుక జలకేళి సవరింపఁ జిత్త ముత్తలపడుచున్నదే. ఈతీరమునఁ బురుషు లెవ్వరును లేరు. సమయ మనుకూలముగా నున్నది రమ్ము.

శశి—ఈవలకే జాగు సేసితి మింకఁ దడసిన నమ్మగారు కోపింతురు. పోవుదమే.

చిత్ర—నాకోర్కెఁ జెల్లింపుము. ఇంతలోఁ దాన మాడి పోవుదము.

శశి—నేఁ డేల నీ యుత్కంఠ? అ దెందునఁ గల్గెనో కానిమ్ము—ఆగు మాగు మల్లదే పురుషుఁ డెవఁడో—వరుణుఁడే—భూలోకమున కేఁగి మరలుచున్నాఁడు. వానిఁ బోనిమ్ము.

చిత్ర—వరుణుఁడు గాడు గిరుణుఁడుగాడు—సితకిరణజాలంబు వెదఁజల్లుచంద్రబింబమే నీటఁ గదలుచున్నది.

శశి—ఏ మటు లనెదవు? అంగసౌష్ఠవముం జూడవే?

చిత్ర—అవునే. మదనుండు గా నోపు. మాక్రీడిం జూడ వచ్చెడి నేమో?

శశి—మదనుఁడో నీపాలిరమణుఁడో నిన్నే చూడ వచ్చునో?

చిత్ర—చాలు నీచమత్కృతి కట్టిపెట్టుము. దగ్గరగుచున్నాఁడు.

శశి—అయ్యో ! దరికి వచ్చిన ట్లుండి మరలఁ బ్రవాహవేగమునఁ బడి పోవుచున్నాఁడే పాపము !

చిత్ర—ఒడ్డునకుఁ జేర్చుదము రమ్ము.

శశి—కరావలంబన మిచ్చి ప్రోవుము. నా కవసరము లేదు.

చిత్ర—పోని మ్మిటులనే చేసెదను. వాని రక్షించుపుణ్య మూరకపోవునా ? (నీటఁ దిగఁ బోవును )

శశి—ఇదిగో వచ్చుచున్నా నుండుము. (ఇరువురుఁ జంద్రాంగదు నొడ్డునకుఁ దెత్తురు.)

చిత్ర—ఈతఁ డెవ్వఁడో సిద్ధుఁడై యుండ నోపు.

శశి—అవు నీతఁడు నీకు సిద్ధుఁడే

చిత్ర—పాప మాయాసమున మూర్ఛిల్లెనే. కొంచె ముపచరించి స్వస్థుని జేయుదము. ఏ మీపున్నమచందురుం గేరునగుమోము ! దీర్ఘభుజాయుగళంబు !

శశి—నీ కేల యీతనిపై నీనిర్వ్యాజప్రేమాతిశయము ?

చిత్ర—ఏమో దేవుఁ డెఱుఁగు. (ఉపచరింతురు.) కదలుచున్నాఁడు. పెదవులును గదలుచున్నవి. ఏమి చేయునో మన మీయిసుక గుట్టమాటునఁ డాఁగి చూతము, రమ్ము (దాఁగెదరు.)

చంద్రాంగదుఁడు—ప్రాణేశ్వరీ ! (మెల్లనఁ గూరుచుండి) ఇఁక నెక్కడి ప్రాణేశ్వరి ! అయ్యో! కట్టిడిదైవము న న్నిక్కడఁ జేర్చెగా ! చల్లనికరపల్లవంబుల నామేను స్పృశించి నాయుల్లంబుబల్లవింపఁ జేసినపల్లవపాణి యెవ్వరో? ఇట నెవ్వరుఁ గాన్పింపరే !— భ్రాంతి. ఏమియాశ్చర్యము! యమునాఘోరంబునం బడినవాఁడి యిప్పుడఁ జేరుకొనువఱ కెవ్వరో కరావలంబన మిచ్చి ప్రోచిన ట్లయ్యె. మృదులహాటనభూరికాంతల్పంబునం బడిన ట్లుంటినే

గొని యాయాన మనున దలంగ. భగవన్మాయ! తల్లి, భగవతీ కాళిందీ!

ఉ. పమ్మిన వేడ్కతో నకరిపైఁ జలికాంద్రము కూడి నీమతో
యమ్ములఁ దేలి యాడు నెడ నందఱు నొక్కెడఁ దేల్ప కేరాతి
రమ్మన నన్నుఁ దేల్చితె! శరణ్యుఁ డెవం డిట? నిర్జనప్రదే
శ మ్మిది! యిల్లుఁ జేరికొన సాధన మెయ్యది? యేరి వేఁడుదున్.

నాస్నేహితురాండ్ర నన్ను వేఱుఁ జేసితివి. ఇందు నా కేతెరువుఁ గాన రాదు. దూరమ్మున మహోన్నతప్రాసాదపరంపరావిలసితం బైన పురవరం బొండు కానంబడియెడి. అం దేఁగి చూచెద. (లేచి నడచును.)

చిత్రి—(చెలితో) ముందునకు వచ్చి) ఓదివ్యమూర్తీ! కృతఘ్నుండవై యెం దేఁగెదవు?

చంద్రాం—లలనామణీ! నే నెట్లు కృతఘ్నుఁడను?

శశి—సరిద్వేగమునఁ బోవు నిన్నొడ్డునఁ జేర్చి నేఁడు దీర్చిన దీమాచెలియే.

చంద్రాం—అట్లయిన మిక్కిలి కృతజ్ఞుండను.

చిత్రి—నీవిపదవస్థ నంతను వింటిమి. నీ వెవ్వండవు? ఇపు డెందుఁ బోనెంచితివి?

చంద్రాం—నేఁ జంద్రాంగదుం డను రాకొమరుండ. నా దేశమునకుఁ బోనెందేనిఁ దెరవు నరయుచున్నవాఁడ. తలోదరీ! బ్రతికించి పున్నెముఁ గట్టికొన్నదాన వాయుపాయ మెఱింగింపగదే. ఈదేశ మెద్ది?

చిత్రి—ఇయ్యది నాగలోకము. రాజపుత్రా! ఇందు వచ్చువారెందుఁ బోఁ గలరు? వలతు వేని మాజనకు నొద్దకు దీసికొని

పోయెద రమ్ము. ఆయన యాదరమ్మునకుఁ బాత్రుండవై సుఖంచెదవు.

చంద్రా—(తనలో)నా కింక సౌఖ్యమేడ? (ప్రకా) తీసికొని పొమ్ము వారినే శరణువేఁడెదను. మీ రెవరు? ఇందేలవచ్చితిరి?

చిత్ర—నేను భుజంగేంద్రునికుమారితను. నాపేరు చిత్రరేఖ. ఈశశికళ నావయస్య, వనవిహారము సలిపి జలకేళి సవరింప వచ్చితిమి.

చంద్రా—కరుణామయుం డీశ్వరుండు మిమ్ము నాకొఱకే పంపినాఁడు. నన్ను బ్రతికించి మానవదుర్లభం బగునాగేంద్రదర్శన మొసఁగూర్చు మీ కెంతయుఁ గృతజ్ఞుఁడను.

చిత్ర—(తనలో) అవు నాకరుణామయుండే నిన్నును నాకొఱ కంపినాఁడు నన్ను రక్షించునో లేదో? తప్పించుకొనిమాత్రము పోఁ జాలవు. (ప్రకా) ఈనాగలోకవైచిత్ర్యముల నారసితే?

సీ. ఆదికోలము హిరణ్యాక్షుని వధియింపఁ
బ్రవహించురక్తస్రవంతి యదిగో
హరిరక్షితద్వార మగుచు నున్నతి నాక
సము నంటుబలిచంద్రశాల యిదిగో
అఖిలభూభార మ్మనాయాసముగఁ దమ
తలలఁ దాలుచు గజేంద్రంబు లవియె
సగరసంభవపుణ్యసంపత్తి హేతు వై
వఱలినగంగాభవాని యిదియె

గీ. మణిగణమ్మున దేదీప్యమాన మగుచు
నల్లదే గోపురాగ్రమ్మునందు హేమ
కలశముం దాల్చి కన్నులకఱవుఁ దీర్చు
నాగలోకాధినాథునినగరుఁ గనుమ.

(నిష్క్రమింతురు.)

3 రంగము. నాగాధిరాజు నాస్థానము.

---

(నాగాధిరాజుఁ చంద్రాంగదుఁడు ప్రవేశింతురు)

నాగా.—గీ. మాకు నీయందదేమొ కుమారవర్య!
నిందు ప్రేమ జనించెను నిన్నుఁ జూడ
మదనుఁడవొ? యక్షుఁడవొ? లేక మానవుఁడవొ?
కాఁపురం బేడ? నిట వచ్చు కార్య మేమి?

చంద్రాం.—భుజగేంద్రా!
సీ. ఏరాజు పాలించె నేకాతపత్రమ్ము
జలధిపరీతభూవలయ మెల్ల
నేరాజు రూపు బృందారకు ల్బొందియుఁ
వైదర్భిచేఁ బరాభవముఁ జెంది
రేరాజు తనయశ్వ హృదయ విద్యఁ బుతు
పర్ణుఁ బ్రీతుం జేసి వడసె మెప్పుఁ
నేరాజు నామమ్ము నెలమి సంస్మరియింపఁ
గలిదోష హరణమ్ముఁ గలుగు నరున
గీ. కట్టి నలరాజు దమయంతియూరుఁ గన్న
పుత్త్రి డింద్రసేనుం డనుభూమిపాలుఁ
డాఘనునకు నేనొక్కండ నాత్మజుండ
కుండలీశ్వర చంద్రాంగదుండ నేను.

ఆర్యావర్తపురాధీశ్వరుండగు చిత్రవర్మ నృపాలశేఖరుకూంతు సీమంతినిం బెండ్లాడి శ్వశురగృహంబున సుఖంబుండి నేఁను లోకబాంధ

వుం డవరాంబుధిం గ్రుంగకమున్న నంగడి కాండ్రం గూడి కాళిందీప్ర వాహంబున నౌకా విహారంబు సలుపు చుండ నొక్క ఝంఝామా రుత మేతెంచియాతరణిం ద్రిప్పి బోర్లం ద్రోచె. యమునా ఘురాంత రంబునంబడిపోవుచుండిన న న్నిరువు రుతగ వనితాలలామ లొడ్డునం జేర్చి నీదివ్యదర్శనమ్మం గూర్చిరి. నే ధన్యుఁడనైతి నీశరణుం జొచ్చితి నన్ను రక్షింపవే.

నాగాధి—పాప మెంత కష్టము. నీకిం దేలోపముండదు లే. నే నభయ మిచ్చితి. సుఖంబుండుము. మీ రేవేళం గొలుచు దైవం బెవరు?

చంద్రా౦:—సీ. పరమమునీంద్రహృత్పద్మగర్భములందు
సిరతిఁ జరించు బంభర మెవండు?
ఉత్తమ భక్త వర్యుల కామితార్థము
ల్నమకూర్చుకల్పవృక్షం బెవండు?
పాతకజీమూతవ్రాతమ్ము బికపిక
లం జెమ్మఝంఝానిల మ్మెవండు
లోకకంటకు లగుసోఁకుమూకల కాన
నమ్మం గాల్చుదవానల మ్మెవండు
గీ. మిమ్ము సేవాఁడు ముదమున మేనఁ దాల్చు
నట్టియాసాంబశివునిపదాంబుజముల
నెమ్మనమ్మున నిల్పి నిత్యమ్ము ధ్యాన
పరులమై యుండువార మోపన్న గేంద్ర.

సీ. త్రిపురాసురుల నొక్కత్రుటిలోనఁ గూల్చిన
మేరుచాపుండె మా మేటిగురుఁడు
కల్పకల్పాయు మార్కండేయుఁ జేసిన
కాలకాలుండె మా కల్పతరువు

హాలహాలమ్మును మ్రింగి యఖిలమ్ముఁ గాఁచిన
నీలకంఠుండె మాపాలివేల్పు
చరణాశ్రితావనబిరుదమ్ముఁ బాలించు
నిందుశేఖరుఁడె మ మ్మేలువాఁడు

ఆ. వె. ఇతరదైవతములఁ నెన్నండుఁ గొలువము
తల్లి మాకు శివుఁడె తండ్రి యతఁడె
దేవదేవు నెపుడు సేవించుమా కింక
సర్వ మతఁడె భుజగసార్వభౌమ.

నాగా—నృపాలనందనా! నీవినయసంపత్తి కమందానందంబు నందితిని నాగభూషణు సేవానుబంధంబున నీవు మావాఁడవే. నేఁటి నుండి మాయిష్టబంధుండవై మామన్నన లంది యిందు యథే చ్ఛాభోగంబు లనుభవింపుము.

చంద్రాం—అయ్యో! అది యెట్లు?

సీ. గడియ నే వాహ్యాళిఁ దడయ న న్వాదకించు
పితరు లేగతి దురపిల్లువారొ?
కూఁతు నన్నుం జూచి కొండంతకొనుసత్తు
మామ లెంత వనట మరగినారొ?
ఒకనాఁడు నను వీడ నుత్సాహమున నాదు
నేమకకాం డెట్టివెతలఁ బడిరొ?
ననుఁ బాసి నిముస మైనను మనఁ జాలని
ప్రేయసి ప్రాణము ల్వీడునేమొ?

గీ. వారిఁ జేరక నే నిందు బ్రదుకఁ గలనె?
భోగభాగ్యానుభవ మన్న బుద్ధి యున్నె?

నా మనవి నాలకించి న న్గనికరమున
స్వజనముం జేర్పు మింక రసాతలేంద్ర!

నాగా—అటులనే పంపెదను. మాయతిథి వై కొన్నినాళ్ళు మమ్మానందింపఁ జేయుము. తొందర యేల?

చంద్రాం—మహానుభావా! తమకుఁ దెలియనియంశ మేమున్నది?

నాగా—నే నీలోపున మీవారలవృత్తాంతముఁ దెప్పించెదఁ గదా?

చంద్రాం—చిత్త, మీసేవకుని రక్షించుభారము మీయది.

నాగా—తప్పు, తప్పు. మాకాత్మబంధుండవే. అమాత్యవరా! ఈరాజకుమారుం గొంపోయి యతిథిగృహంబున విడిది చేయించి సకలోపచారములకు సేవకుల నేర్పాటుఁ జేయింపుము. మనవీట నాతని కేలోటును రాఁ గూడదు.

మంత్రి—చిత్తము.

(నిష్క్రమింతురు.)

---

4 రంగము. కుండినగరప్రాంతము.

---

సుమేధుఁడు, సామవంతుఁ డాడువేసమున బ్రవేశింతురు.

సుమే—ఓరిసామవంతా! ఎంతలో నిట్లు మాఱితివిరా ?

సీ. పిల్లజుట్టును మాటుపెనుసవరా లుట్టి
విన్నాణ మాసిగవేసి నావె!
భస్మరేఖల మాని పసపు నీటుగఁ బూసి
కుంకుమతిలకంబుఁ గూర్చినావె!

రుదరాకపేరుల వదలి మేల్నల్లపూ
సల కుతికంటుఁ గీలొల్కాలిపినావె
బిళ్ళగోచులపంచె విడిచి రింగులు వారఁ
గరకంచుకోకను గట్టినావె!

గీ. రాగికమ్మలు చెవులకు రక్తి నింప
కంచుకము కృత్రిమస్తనగరిమఁ జూపఁ
జిటుకుఁ జిటుకున మట్టియ ల్చెలఁగి మోఁయ
నహహా! తుటిలోనఁ జేదము న్తైదు వైతె!

సామ—నాటకసమాజమువారిసాయమున నింతత్వరలోఁ గుదిరినది. ఇఁక జాగుసేయక పయన మగుదమా?

సుమే—ఓరీ! నీ కీమోస మన్న నింత చులకనగా నున్నది గాని నాకు మాత్రము భయ మగుచున్నది.

సామ—న న్నెవ్వరేని గుర్తింతు రనియా?

సుమే—బ్రహ్మకుఁ దరమా? అందులకుఁ గాదు.

సామ—మఱి యేల?

సుమే—పిన్నవా రయ్యు సమస్తశాస్త్రముల నంతలో నేర్చి రని పేర్వడసిన వేదవిద్యాపారంగతుల మగుమన కీదంభదాంపత్యము తగ దని నాడెంద ముత్తలపడుచున్నది రా.

సామ—ఓరీ సుమేధా! ఇంకను నీచాదస్తము మానవైతివే? మనవివాహములకు వలయువిత్త మిం కెటులు లభించు ననుకొంటివి? సీమంతిని మన కర్పించుధనము వివాహములకే గాక జీవితాంతమువఱకు గుటుంబపోషణమునకు సైతముఁ జాలునది. వానికడుపు చల్లగఁ గుండినవిభుండు చక్కని తెరువు నే చూపినాఁడు.

సుమే—దూనకర్ణుం డని వాని వేడితిమి. తనకుఁ దోఁచిన దీయ కతఁ డిట్టివిపరీతమార్గ మవలంబించె నేల ?

సామ—అతఁ డది దైవప్రేరిత మని చెప్ప లేదా ? మనభాగ్యము. రాజాజ్ఞఁ బాలించుట మనవిధి. విధి నెరవేర్చినఁ దప్పేమి ? అది గాక పురుషుఁడు స్త్రీ వేషము వేసిన నేమి. స్త్రీ పురుష వేషము వేసిన నేమి ? స్త్రీపుంసభేదంబు నశ్వరం బగుదేహ గతంబు. నిర్వికారం బగునాత్మ కీభేదంబు లున్నె ? లోకంబునఁ బురుషుల మించినస్త్రీలును, స్త్రీలకు లోఁగినపురుషులునుం గలరు. పై వేసములతోఁ బని యేమి ? బ్రతుకే కల్ల కల్లలోఁ గల్లలన్నఁ గల్లలే. సర్వము శివమయం బనుతత్త్వ మెఱిఁగిన నీభేదబుద్ధి నశించును. తప్పక మనకు శుభ మగును. నామాట నమ్ము. వే రమ్ము.

సుమే—సరియే గాని నీస్త్రీపాత్ర మెట్లు పోషింతువో ? కఱవునకు దానరి యైనంతనే పదంబులు వచ్చునా ?

సామ—అభయ మక్కఱ లేదు. నాజాణతనము నీవే చూచెదవు. రమ్ము. (నడచుచుందురు) సుమేధా ! అదె విప్రదంపతు లెవ రో వచ్చుచున్నారు. ఇంక నానాటక మారంభింతును. జాగ్రత్త. నవ్వకుమా, నగుబాటు.

(వృద్ధసోమయాజియుఁ బడుచుసోమిదమ్మయుఁ బ్రవేసింతురు)

సోమి—దారిపాడవున వేఁచుచున్నావు. ఇఁక నీమె సాయముందును. నీబాధ కవంత తగ్గునుగా ? (సమీపింతురు)

సామ—అమ్మా, మీ రెక్కడికిఁ బోవుచున్నారు ?

సోమి—ఎచ్చటనో ! ఆర్యావర్తపురమున సీమంతిని సోమవారవ్రత మాచరించు నఁట. మాకు నగుబాటు లఁట—ఎంతనడచినఁ దీఱకున్నది.

సాము—ఇదిగో, ఏమండోయి, వీరును మనతో వచ్చువారే. ఇంత సేప టికి నాప్రాణము గూటఁ బడినది. అఁదుతోఁడు లేదని కించఁ బడుచుంటిని. అక్కా రండు. మేము నచటికే వచ్చుచున్నాము ధన మన్న నాశ కదా ?

సోమి—అందులకే యెంతకష్టమైన నోర్చి పచ్చుచుంటిని. అక్కా, మీామఱదిగారివల్ల పుస్తెముక్క తప్ప మఱియేమియు నెఱుఁగను.

సాము—పలయు నన్నినగలఁ బెట్టుకొనవచ్చును లెండు.

సోమి—నీవును దోఁడుపడితివా ?

సాము—ఏమి భావగారూ, అట్లావిసుగుఁ జెందెదరు?

సోము—నగలు నాకెను లెట్లువచ్చు? పాతికేండ్లకుఱ్ఱగాఁడు. నాప్రథమమున కున్నాఁడు. వాని నొక యింటివానిం జేయఁ నక్కఱలేదా?

సాము—ఈధన మందులకా ? మీావివాహముం బలెఁ జేయఁగూడదా?

సోము—అయిదేండ్లకుఱ్ఱముండ నరువదేండ్లవాని కమ్మి సంచిరూపాయలకు దీనిం గొంటిని.

సాము—ఏమీా కన్యాశుల్కము! పశువులా బేరమునకు? ఇంటఁ బుట్టినపశువుల నైన విక్రయింప మన సొగ్గదే! కడుపునఁ బుట్టినపసికూనల మూాడుకాళ్ళముదుసలుల కెట్లమ్మెదరండీ? పోనిం డింకొకరిత నమ్మఁ గూడదా కుమారునివివాహమునకు?

సోము—ఇఁకఁ గూఁతులు లేరే? ఉన్న నట్లే చేతును మానుదునా? దీనికడు పెపుడు పండునో నాయిల్లెప్పుడు నిండునో.

సాము—(తనలో) ఈజన్మమున కింతే. (ప్రకా) బావా! నగలం బెట్ట లేనివారు పెండ్లియాడు టెందులకు?

సోము—నిత్యానుష్ఠానముఁ దీఱ్చు టెట్లు? దేవపితృకార్యములు ధర్మ

పత్ని లేకుండ సాఁగవు గదా? అమ్మా! మాగోడవ నీకెం
దుకు? నీసాయము దొరికిన దింకఁ బోరుండ దనుకొంటిని
గాని హెచ్చినదే! నీకుఁ బుణ్య ముండు నూరకొనుము.
ఇన్నిమాట లాడుచున్నావు. నీకు మాత్రి మేమున్నది?

సామ—నిజమే. స్త్రీసామాన్యమున కుండుపాటి సైతము నాకు లేదు. అయిన మావారే నా కమూల్యాభరణము.

సోమ—నేను నల్లె. ఏమే, సోమీ, పలుక నేమి ?

సోమి—తక్కు వేమి !

సామ—మాబోటియనుకూలదాంపత్యము మీా కున్నదా?

సోమి—అక్కా ! అలాగుబుద్ధి సెప్పు.

సోమ—లే కేమి ?

సామ—మీాకుఁ గాదు గదా లోకమున నింకెవ్వరికి మావంటి దాంపత్య ముండ బోఁ దని నమ్మ.

సోమ—అమ్మా శుత్రి మించుచున్న దే ! అఁదుదాన వని మీాసాయ మపేక్షించి మోసపోతిని.

సామ—సందేహా మేమి ? నిశ్చయముగా మోసపోయినారు. అవునా, యేమండోయి ! ఎవరో వచ్చుచున్నారు. మీా రిట దగ్గరగా నుండరుగా. మే మాఁడువారము. వీరు వృద్ధులు. (ఒకఁ డా దారిం బోవును.) అక్కా !ఉండు వానిం బోనిమ్ము. (సోమిదేవి వెన్కకుఁ బోవును.)అదేమి పోగాలమమ్మా? వాఁ డిట్లా యెగాదిగా చూచుచున్నాఁడు ? నాకు భయ మగుచున్నది.

సోమి—సరి సరి ! ఇదేమిభయ మక్కా, రా, వాఁడేమి చేయును.

సామ—నే నెన్నఁ డిల్లు విడిచి యెఱుఁగను. మగవానికంటఁ బడినఁ జచ్చిన ట్లగును.

సోమ—చూడు. ఆమెం జూచి బుద్ధి తెచ్చుకో. స్తంభ మట్లు నిలిచి వాని కేసే చూచెదేమి?

సోమి—ఆమెభాగ్యము నాకుండినc గదా?

(మిక్కుట మగుధ్వని వినc బడును.)

సామ—అవు నండోయి, ఏమూగోల? పులియో భూతమో! దాని వాత నేయకండీ. దూరదూరముగా నుండకండి. మీకుc బుణ్య ముండును.

సుమే—ఊరు సమీపించినాము. విప్రదంపతులకోలాహలము. మరేమియుc గాదు.

సామ—అ దేమిటో వచ్చుచున్నది. అక్కా, యీప్రక్కకు రా.

సోమి—జోడుగుఱ్ఱములబండి, భయము లేదు రా.

సుమే—ఆదారిం బోవుచున్నది రండు.

సామ— నా కేమిదారి మీ రట్లాతొందరగాc బోవుదురు? ఆడువారము మీతోc దొందరcగా నడువc గలమా? అయ్యో కర్మమా, నన్ను వదలుచున్నారే! ఇట్లాంటి మార్గా లెన్నc డైన నెఱుcగుదునా?

సుమే—అదిగో చిత్రవర్మమహారాజుకోట వేగ రండు.

సామ—నమ్మర్ధ మెక్కువగా నున్నది తప్పదు నేమో, నాచేయిc గట్టిగాc బట్టుకొండు. తప్ప లేదు నా చెయ్యి గా! రండు. (చేతులు పట్టుకొని నిష్క్రమింతురు.)

———

5 రంగము. కోటవెలుపలియుద్యానవనము.



(సుమేధుఁడు సామవతి ప్రవేశింతురు.)

సామ—చూడండీ, నేఁటితో మనదారిద్ర్యము విచ్ఛేద మైనది. మా యాలేనన్ని నగలు. దక్షిణాద్రవ్యముతో మనకుటుంబము తర తరములు బ్రతుకవచ్చును. ఈధనముం గని నాయుత్తమామ లపార ముదం బందెదరు. కొన్ని నగల నత్త గారి కిత్తమా? పెద్దముత్తైదువు. ఆమె నంతసమీ మనకు శ్రేయము. ఊ! మాటాడ రేమి?

సుమే:—ఇఁకఁ జాలు నోరు కట్టురా సామిగా.

సామ—ఏ మవాచ్యము లండీ? ఇష్టము లేకున్న మాని నూరక తిట్టెద రేల?

సుమే—చాలు నూరకుండుము. అందఱికన్నులం గప్పి లాభములఁ బొందితి మిం కేల యీకపటనాటకము? ఇం దెవ్వరును లేరే? కిక్కురు మనక వేగ నింటికిఁ బదమాఁ మన మీద్రవ్యముఁ బంచికొందము.

సామ—మనలోఁ బంపకమా? ఏమిమాటలు! మీకును నాకును భేద మేమి?

సుమే—అది కాదు రా! నాద్రవ్యము నాపెండ్లికి నీద్రవ్యము నీపెండ్లికి—

సామ—అయ్యో కర్మమా! నాకుఁ బెం డ్లేమిటి?

గీ. ఎంతపున్నెమ్ము సేసితో కాంత మిమ్ముఁ
బతిగఁ బడయఁ జాలినమహాభాగ్య మబ్బె

నల్లదంపతు ల్వాలె మీరు నింటి కేఁగి
భోగములఁ దేల లేక యీబుద్ధు లేల ?

సుమే—నీబుద్ధి బుగ్గిగాను, ఊరకుండు రా.

సామ—పోనిండు. నేఁ దగకున్న నిం కొక తెం దెచ్చి కొనుఁడు. మీ యిరువురకుఁ దాస్య మేసియుఁ జేయుచునుందు నేగాని యీ కొక్కనిఁ బెండ్లియాడు దాననా ?

సీ. అతికురూపకుఁ డైన నతిసురూపకుఁ డైన
నాథుఁ డీశుం డంగనామణులకు
నిరుపేదయేని బెన్నిధి గలాఁడేనియుఁ
రమణుఁ డీశుఁడు నతీరత్నములకు
బహుదారుఁడే నేకపత్నీవ్రతుం డేనిఁ
గాంతుఁ డీశుఁడు కులకామినులకు
పామరుం డైన నత్పండితుం డైనను
బతియె యీశుం డేకభర్తృకలకుఁ

గీ. గొట్టినను దిట్టినను నెత్తిఁ బెట్టుకొనిన
ధవుఁడె దరియింపఁ జేయంగఁ దగినదేవుఁ
డట్టిదేవునిఁ గొల్వవునంగనలకు
మార్గమువు కన్న మే లౌను మరణ మరయ
మనదేశపుఁగులీనస్త్రీల కున్నసాభాగ్యమే యిది.

సుమే—ఓరీ సామవంతా ! ఏల మిగుల వాగెదవు? నీనాటకమున కిఁక నైన భరతవాక్యముఁ జెప్పుము.

సామ—ఏమి నాటక మండీ ? మనోవాక్కాయకర్మంబుల మిమ్మే దైవ మని నమ్మి సేవించుచున్న నాపవ్రివర్తననాటకమా ? భార్య యన్న సామాన్యమే ?

సీ. దానంబు లొనరించి ధర్మార్జనము సేయ
జాయయే మిగుల సహాయురాలు
పుత్త్రరూపంబునం బుట్టి పెంపొంద స
ద్గాంగలక్ష్మియె తగినట్టి చోటు
భావభవగ్లానిఁ బాపి సౌఖ్యముఁ గూర్పఁ
బొలఁతిమిన్నయె సుధాపూర్ణసరసి
అపవర్గసౌధమం దధివసించుట కైన
భార్యయే రత్నసోపానపఙ్క్తి
గీ. భవ్యగుణధామ పరమలావణ్యసీమ
ప్రేమజలరాశి దుఃఖనిర్భేదనాసి
గృహిణి సంసారసింధుపరికల్పితతరణి
పడఁతి పతిమన్ననలు పెందఁ బాత్రురాలు.

అట్టిధర్మ మెఱింగియు నన్నేల నిరసించెదరు ?

సుమే—నీకర్మము. (పోఁ బోవును.)

సాము—(వెంట నంటి వాని నిలిపి)

గీ. నన్ను విడనాడి చన మీకు న్యాయమౌనె?
బ్రహ్మ మగవారిమనసును ఱాయి చేసె!

సుమే— నచ్చపుం దన్వివలె నాడె దిచ్చకములు
చాలుఁ జాలును నో ర్మూయు సాముపంత.

సామ—సరి సరి! న న్మగవానిగా నెంచుచున్నారా ? నేనే మగవాఁడ
నైన నా కీపా ట్లేల ?

సుమే—సీమంతినియంతటి సాధ్వీమణిని మోసగించి నగల గడించుటకు
నైనసాముపతివి రా నీవు. కావలసినదైన దింక నీవిరహాభి
నయం బేల ?

సామ—ఇది యభినయమా? ఏటికీవ్యర్థాలాపములు? ప్రాణప్రియా!
ఈశరచ్ఛందాశ్రితపము పాల్సేసి న న్నేచ నేల?

సీ. నెలతాలనునుతిన్నియలఁ జేరి నాతోడ
హాయిగా ముచ్చట లాడ రాదె?
కన్నపండువుఁ జేయు పొన్న చెంతను మోవి
విందులఁ దమి తీఱ నంద రాదె?
పొగడమాటున జేరి ముదమార నన్నుగా
ఢాలింగనమ్మున నేల రాదె?
ఈమల్లెపొదదండ నీవు నాతోడుత
మదనాహవమున మార్మలయ రాదె?

గీ. భావజుం డిటు శరపరంపరల నేసెఁ
దరళమతి నైతి నే నింకఁ దాళఁ జాల
దర్పకునికన్న నీవె నిర్దయుఁడ వైతి
దుర్భరం బైనతాపంబు తొలఁగు టెట్లు?

సుమే—శ్రుతి మించినదే? ఇదె నిన్నావేసించినకామినీభూతము
బాలఁ దోలెద. (కొప్పుఁ బట్టి యీడ్చుకొని పోవును. మరల
బ్రవేశింతురు.) (నిర్వర్ణించుచు) అయ్యో! యెట్టివైపరీత్యము!

ఆ. వె. పిలకజుట్టు వోయె! బెన్గొప్పు తిర మయ్యె
రక్తిమమున మోవి రమ్య మయ్యె!
జక్రిసామ్యమందెఁ జన్దోయి! వీఁ డిటు
పడఁతి యయ్యెఁ బాపఫలము పండె!

గీ. ఎలమి సీమంతినీదేవి యీశ్వరి యని
స్వాంతమం దెంచి పూజించినంత నితఁడు

సామవతియయ్యో నకట! మోసము ఫలించె
సాధ్వి మొఱఁగిన నెందేని జముఁడు సెకఁడె ?

అయ్యో! ఎంత వేఁడుకొన్నను వినక వీఁడట్టిమోసమునకు నెట్టు కొని పౌరుషంబున్ గోల్పోయి తనతండ్రి గతికి నీళ్ళధార విడిచెనే! దయామయు లగుపార్వతీపరమేశ్వరులారా; మీభ కురాలిని మోసగించినందుల కిట్టికఠినశిక్ష సేయఁ బాడియే గాని కుటిలస్వభావుఁ డగుకుండినప్రభువుపేరణ గాని స్వయం కృతాపరాధము గాదని యీదీనులఁ గనికరించి ప్రోవరే!

గీ. బుద్ధిజాడ్యంబున నోర్మనబుద్ధి మాకుఁ
గలిగెఁ దనయులతప్పిదములను సైచి
వేఁ బ్రసాదింపరే దయ నీవని కిపుడ
పౌరుషము తొంటి యటు లిల్లుచేరులోన.

సామ—గీ. నాకుఁ బుంస్త్వముం గోరునానాథుఁ డకట
యింతకంటెను మాధ్య మెందేనిఁ గలదె?
నన్నుఁ బురుషుఁ జేసి మీరు నానాథు నిపుడు
గులసతీవియోగంబునఁ గూర్పఁ దగదు.

సుమే—ఓరీ సామిగా! ఇచట నీబాధ పడఁ జాల నింటికిఁ బోయి యపరదుర్వాసుం డగునీతండ్రిబాఱిఁ బడి చచ్చుటకంటె నిచ్చ ట నే చచ్చిన మేలు.

ఉ. కుండినమండలేశ్వరుఁడు గోరిగ మార్చినయంత సామవం
తుండు సతి న్మొఱంగుచు నధోగతి పాలయి పోయె నన్న నే
నుండి భరింపఁ జాల నిఁక నుర్వి బుణ మ్మిదె తీఱె నాకు నీ
యుండను జేర్చి కొ మ్మిదె జలాశయవారి మునింగె దక్షహారా,

సామ—(వానిఁ బట్టి నిలిపి)

గీ. నాథ! మీ రిట్లు దుడుకుఁదనంబుఁ జూపి
నన్ను దుఃఖాబ్ధిఁ దోయఁగాఁ జన్న మీకు?
ముందు న స్థలములఁ బడిపోవ నింత
మీవియోగంబు నోర్వ నిమేష మైన.

(ఒకరికంటె నొకరు ముందుగాఁ గాసారమునకుఁ బోఁ
బ్రయత్నింతురు.)

ఆకాశవాణి—సామవతీసుమేధులారా!

గీ. మరలుఁ డింటికి మీరు దంపతులు గాఁగ
నిల్లు దీర్ఘంగ భాగ్యంబు లెల్లఁ గల్గుఁ
దనయుఁ గులవర్ధనుని దీనితండ్రి వడయు
సామవతి కింక రాదు పుంస్త్వంబు మరల.

సామ—నాపాలిభాగ్యదేవత యశరీరవాణి మనదాంపత్యము నిలిపె
నింక నింటికిఁ బోవుదము రండు.

సుమే—ఓరీ-(నవ్వుచు) ఓసీ! సామవతీ!—

సామ—ప్రేయసీ! యని లాలించినఁ దప్పా? రండు.

(చేతులఁ బట్టుకొని నిష్క్రమింతురు.)

---

6 రంగము. యమునానదీతీరము.

---

(సీమంతినియును జెలికత్తెయుఁ బ్రవేశింతురు)

సీమం—

ఉ. చిన్నటనాఁటినుండి మిముఁ జెక్కువిధమ్ముల నమ్మి కొల్చున
న్గన్నడ సేసి యిమ్మెయి నగాధవిషాదపయోధి ముంపఁ గాఁ

జన్నె ? విలాసమే? మనఁగఁ జాలుదునే విభుఁ బాసి యింక నో
పన్ననుఁ బ్రోవఁ జాలరొకో? పార్వతియుం బరమేశ్వరుండుఁ గాను.

(నీటఁ దిగి)

శా. వేడంబో నిఁక మిమ్ము నిర్దయుల నోవిశ్వేశ! యోశాంకరీ!
రాఁ డయ్యెన్ హృదయేశుఁ డీవిరహభారం బూని నే నుండ ను
న్యేడు ల్దాఁటె భరింపఁ జాల నిటుపై నీవిప్రయోగం బిదే
నేఁ డీయామునవారిఁ గూలి తుదిలో నే నాథునిం గాంచెదన్.

చెలి—సఖీ! ఇన్నినాళ్ళోర్చియు నిప్పు డీతొందరపాటి దేల? చూడు
మల్లదే యోగీశ్వరు లెవ్వరో యేఁగుదెంచుచున్నారు. త్రికా
లవేదు లగుయోగులదర్శనము రిత్త వోవునే! (యోగి సమీ
పించును) నేఁ డీశ్వరుఁ డనుగ్రహించుఁ దొందర వలదు.

యోగి—లలనామణీ!

గీ. దివ్యదృష్టిని మా కెల్లఁ దెల్ల మయ్యె
వలదు నీ కిట్టితొందరపాటు తన్వి!
ప్రాణములఁ గోలుపోవ నేఫలము వచ్చు
బ్రతికి యుండిన న్సుఖములఁ బడయు వచ్చు.

సీమం } మహాత్మా! నమస్కారము.
చెలి }

యోగి—శుభ మగుఁగాక! (చెలితో) యీబాలిక చిత్రవర్మనృపా
లునికూఁతు సీమంతిని చంద్రాంగుడు నర్ధాంగలక్ష్మి కాదా?
పాప మీమె కిట్టినవయౌవనారంభమున నెట్టిదుర్భర వియోగ
దుఃఖము సంభవించె.

చెలి—యోగిపుంగవా! తమకుఁ దెలియనియంశ మే మున్నది. తాము
సిద్ధులో దివ్యులో ప్రమథవరులో మా చెలిభాగ్యవశంబున

దర్శనం బిచ్చితిరి. ఈమెకు భర్తృపునస్సమాగమప్రాప్తి యున్నదో లేదో సెలవిండు.

యోగి—ఇం కెక్కడిప్రాప్తి! (సీమంతినియుఁ జెలియు నిర్విణ్ణలగుదురు.)

చెలి—అట్లు సెలవిత్తు రేల?

యోగి—మేము సిద్ధుల మీధాత్రీవలయు మెల్లఁ దిరుగుచుందుము. మే మిపుడ పాతాళలోకము నుండి వచ్చుచున్నాము. చంద్రాంగదుండు నాగేంద్రసాన్నిధ్యమున నున్నాఁడు. మే ముం దుండుతఱి మా కత్యంతప్రియశిష్యుండై యుండువాఁడు. ఐన నేమి? ఇం దుండువా రందేఁగుటయే గాని యం దుండువా రిందు వచ్చు టెందేనిం గలదె? అతఁడు మగుడి వచ్చు టరిది.

సీమం—(తనలో) ఇప్పటికి హృదయభార మొక్కింత తీఱినది. బ్రతికి యుండిన నెప్పటి కైనఁ గలిసికొన లేనా? (ప్రకా) దేవా! కనికర ముంచి యీయుపాయద్వారంబున నానాథుం జేరికొను తెఱువుఁ బ్రసాదింపవే. (పాదముల కెఱఁగును.)

యోగి—ముద్దరాలా! అయ్యదెన్నఁటి కేని సాధ్య మగునా? నీట మునుంగకుమా ప్రమాదము. నీభర్త భోగభామినీకటాక్షవాగురలం దగుల్కొనియెను. అతఁడు ని న్నెన్నఁడు స్మరియింపఁ గాఁడు. సూక్ష్మం బగునొక్కతెఱఁగోపాయ మెఱింగింతును వినుము.

సీమం—మహాప్రసాదము.

యోగి—గీ. ఇంతి నినుఁ దలంపనివాఁ డదేటిమగఁడు?
వానిపై నాస నీ వింక వదలుకొనుము
కనికరముఁ జూపి న న్నేలుకొనఁగ రాదె?
నినువిడిచి యుండ సు మ్మరనిమిషమైన.

సీమం—ఛీ! ధూర్తా! తొలఁగి పొమ్ము. (వెనుకఁ దిరిగి) నే నాభుజ
గేంద్రునే వేఁడికొందును.

సీ. నీట మున్గిననాథు నెయ్యంబుతోఁ బ్రోచి
తనయు నిచ్చిననీవ తండ్రి నాకు
సీమంతినీపుత్త్రి సేయుసన్నుతు లంది
గొనిపొందు మీలోకమునకు వేగ
భూలోకమునకు మీపుత్త్రికతోడ నా
ప్రాణేశు నైనఁ బంపంగ రాదె?
అవస్థపైఁ దనయుకు సవతిపో రని చింతఁ
బొందకుఁడీ మదిన్ భుజగనాథ!

గీ. పతికిఁ బతి తెచ్చుకున్నసుదతికిఁ గూడ
నూడిగము సేతుఁ బ్రాణంబు లుండు దనుక
నమ్మ; పతిసముద్భవైభవమ్ము నిమ్ము
నమ్మి మిము సదా కొల్చెద నాగరాజ!

యోగి— గీ. సపతిపోరాట మన్నను సంబరంబె?
కోరుకొని తెచ్చుకొన నేల కొఱ్ఱు నకట?
కామరూపుండ న న్నేలఁ గరము సుఖము.

సీమం—చూచె దేమి చెలీ? కాలులఁ బ్రేలుగోముఖవ్యాఘ్రమును
గెంటుము.

యోగి—నీపతిని యేలు కొమ్మింక నీరజాక్షి.

(యోగిమాయమై చంద్రాంగదుండును జిత్రరేఖయుఁ బ్రవేశింతురు.)

చంద్రాం—ప్రియసీ! (సీమంతిని దూరముగాఁ బోయి వెనుకకుఁ
దిరుగును.) ఈశ్వరానుగ్రహంబున మఱల నిన్నినాళ్ళకు నిన్ను
జేరఁ గల్గితిని. ఏల నన్నుం జూడవు? ప్రతికూలదైవ మల

నాఁడు నౌకాయాత్రారూపంబున మన కెడబాటుఁ గూర్చె. వియోగదుఃఖంబున నెంత కృశించితే కృపం జూడుమా.

సీమం—(తనలో) కటకటా! ఆ కామరూపుఁ డెట్టిమాయఁ జేయుచున్నాఁడు! నేఁ డీయుకునాదర్శనంబున నాకెట్టిపరాభవంబు రానున్నదో! (ప్రకా) చెలీ! ఇంకొక్క క్షణమే నిందుండ రాదు. పోదము రమ్ము. (పోఁ బోవును.)

చంద్రాం—(ఆమెనాపి)

గీ. అకట! నాప్రాణపదమ నీ వలిగె దిట్లు
సవతిఁ దెచ్చితి నని నీవు చివికె దేమొ?

చిత్రరేఖ— అక్కరో! కిన్కవలదమ్మ ప్రాణనాథు
నిన్ను నిచ్చలు సేవించి నెగడుదాన.

సీమం—(తనలో వీఁడు మాయిగాని యీసాధ్వి—ఏమో! యిది యనుమోసకత్తె కాఁ గూడదా?

చంద్రాం—నాపరితాపంబు గణింప వైతివి. నీవైమన్యంబును జూడ జాల. నీకటాక్షావలోకనంబు నాపైఁ బఱపుము. మనపరితాపం బుడుగును. (ఆలింగనము నపేక్షించి దగ్గరఁ జేరును. ఆమె తొలఁగును.)

సీమం—(తనలో)

గీ. నాథుఁ డితఁ డన్న నమ్మదు నమ్మ జాల
నక్కటా ద్వంద్వసంకట మయ్యె నాకు
ఇఁక మహాదేవ విషమపరీక్ష మాని
యేఁ బ్రతివ్రత నైన వీఁడెవఁడో చెపుమ.

(ఈశ్వరుఁడు ప్రత్యక్ష మగును. అందఱు మ్రొక్కుదురు.)

ఈశ్వ— గీ. ఇతఁడె నీనాథుఁ డోపతివ్రత నిజంబు
కాంచితివి దీని నీవ్రతగౌరవమున

మెచ్చి నినుఁ గావఁ దపసిగా వచ్చితిఁ దొలి
వేఁడికొం డిఁక వరము వేర్వేఱ మీరు.

చంద్రా—దేవదేవా. నీదివ్యదర్శనంబున ధన్యుల మైతి మిఁకేమి కావలయు ?

సీమం—గీ. సేవకులఁ బ్రోచి కైవల్య సిద్ధి నిచ్చె

ఈశ్వ— చిరము సౌభాగ్య కలితలై జీవితేశు
భక్తి సేవించి మించి సవతులు పుడమి
నిల్లు మెలఁగంగ వలె నంచు నెఱుఁగఁ జెప్పుఁడు.

మీ రెల్లరు గృహస్థధర్మంబుల నెరవేర్చి ముదిమిని నాలోఁ గలియుదురు గాక !

అందఱు—మహాప్రసాదము.

చెలి—క. మంగళ మీశ్వరులకు సౌ
మాంగల్యం బీసతులకు మారారా జీచం
ద్రాంగదునకు మంగళ

సీమం— .......................మే

భంగము వ్రతమునకు రానివర మీయఁ గదే.

ఈశ్వ—అట్లె యగుఁ గాత !

(అంతర్ధాన మగును.)

(అందఱు నిష్క్రమింతురు)

---

8 రంగము. కైలాసము.

(పార్వతియు నీశ్వరుఁడును ప్రవేశింతురు.)

ఈశ్వ—దేవీ ! సీమంతినిభక్తినిరతి నరసితే ?

పార్వ—నీయర్ధాంగినై యుండి చూడకుందునే ? భక్తానదీ తూలత్న ...దుంప వగునీకుఁ దీక్షిక యే లేను గాని—

ఈశ్వ—ఏల సంకోచించెదవు ?

పార్వ—దేవా! మన మిరువుర మేఁగి నాజననీజనకుల నొకసారి చూచి రా నేడ్క జనించె. నాముద్దుచెల్లింప వే.

ఈశ్వ—ఇందుకై యింతగా వేఁడ నేల ?

గీ. సవ్యసాచి తుషారాద్రిసానువందుఁ
జేరి ఘోరతపమ్మును జేయుచున్న
వాఁడు వానికి నిడ వలెఁ బాశుపతము
పోయివత్తము నీజన్మభూమి కిపుడ.

పార్వ—ఉభయావశ్యకము గదా ?

ఈశ్వ—వానిశక్తిసాహసములఁ బరీక్షించి దివ్యాస్త్రప్రయోగోపసంహారంబు లుపదేశింప వలయు. మూకుం డనురాక్షసుని వరాహరూపంబున నర్జునునిపైఁ బఱపెద. మనము కిరాతరూపంబుల నా పోత్రివెంట నకటి వానితోఁ గయ్యంబుఁ గల్పించుకొన వలె రమ్మి.

(నిష్క్రమింతురు)

(జవనిక దిగును.)

ఇది తృతీయాంకము.





శ్రీరస్తు.

# శివరాత్రి

## చతుర్థాంకము-కిరాతార్జునీయము.

---

### 1 రంగము. హిమగిరి అర్జునునితపోవనము.

(అర్జునుఁడు పుష్పములఁ గోయుచుండును.)

అర్జు.—గీ. కర్ణికారము ల్గలువలుఁ గాంచనములు
బిసరుహములు నమేరువు ల్బిల్వములును
వకుళము ల్ద్రోణములును సంపంగెపూలు
నజ్జ నిండెను బూజకు సమయ మయ్యె.

(కుక్కలు మొఱుఁగును) ఏమి యీభీకరకౌలేయకారావములు! మృగయానంరంభంబు గానోపు. దుష్ప్రవేశం బగుతపోవనప్రాంతంబునకు మృగయు లెటు వచ్చిరో! నాతపమ్మునకంతరాయంబు రాదు గద?—అదిగో! గున్నయేనుంగుఁ బోలినభీకరం బగుసూకరం బొండు భూరుహషండంబులం ద్రొక్కిగొనుచు గొరిజలతాకున శిలాశకలంబులు దొరలి వాని ఘుర్ఘురఘోషంబుల దిక్కులు మాఱు మ్రోయఁ బరు వెత్తెడిని! ఓహో! ఉంకించి నావైపే వచ్చుచున్నదే! అట్టు నుండి మృగయులు రాఁజనువారు. దీనినొక్కకోల నేలఁ గూల నేసెదఁ

("వలదు, వల" దని దూరమునుండి కేకలు. అర్జునుఁ డొక వైపునను గిరాతుఁ డింకొకవైపునను బాణము వేయుదురు. పంది గిరగిరం దిరిగి నేలఁ బడును. కిరాతులు తొందరగాఁ బ్రవేశింతురు.)

కిరాతుఁడు—అరే! యెవుడ్రా నీవు? పంజెం బడొచ్చొద్దు వొద్దంటా వుంతే మామాటినక దీన్ని గొట్టినా వెంది? నీకేం కావ్వా?

అర్జునుఁడు— గీ. పైపయిం బాఱివచ్చెడిపందిఁ గూల
నేసినాఁడఁ దప్పేమి రా యిందునాకు?
నమితిగాఁ బ్రేలి నాదుకోపాగ్ని నిపుడు
రగులఁ జేయక పో పో కిరాత మూర్ఖ!

కిరాతి—(భర్తకు) సామీ! అయిందా? పందె మోడిపో నావు లే. ఈడు కొట్టినాడంట దీన్ని.

కిరాతు—సీ! అదేం మాట? (అర్జునకు) ఏటోయి? ఒక్క కోలతో దీన్ని సంపేస్తానని పందె మేసి కొడ్తే మద్దె నువ్వె డొచ్చె వురా సానకంనో ఫుల్లనాగ? పందెం పాడు సేసీసి నావు. తబిసివై పోనావు నే కుంతె ని న్నమాంతంగా సంపేద్దు నురా. నువ్వెలాంటితబిసివిరా? ఒక్కాడ ముక్కు మూసు కోని కూకుడుంతావా శపాన్కి. నేతపో తేటాడతావా? నిబ్బగ తబిసి వేనా? యేసిక మేసి నావా?

అర్జు—ఓరి పులిందా! వేఁట ధర్మమెఱుఁగని మొఱకుఁడవై తొలి నేఁ గూల్చినకిటిం గొట్టి మీఁదుమిక్కిలిఁ బరుసము లాడెదే? ఇవ్వనమ్మునం బ్రియాంగనం గూడి క్రుమ్మరెదేల? మృగయావినోదమ్ముల మృగేక్షణలు పాల్గొనఁ దగదు. ముందెన్నఁ డిట్లు చేయకుమా. నేఁ జంపకుండినఁ బంది నీకో నీభా

ర్యకో ప్రమాదముఁ జేసియుండును. ఈవఱకుఁ జచ్చియుం
దురు. కృతజ్ఞుఁడవై పొమ్ము.

కిరాతి—(భర్తకు) సిగ్గు నేదా? యింకా డాబు కొడ్తావు.

కిరాతు—అబ్బోసి! ఏటోయి నీడాబు? నా కాడనా? నా నోరను
కున్నావు? శక్కరొర్తిని. బద్దరం. ఈకాం డేలేవోణ్ణి తెల్లే?
న నోడు నంపుతాడా? నాపెల్లా మోరనుకున్నావు?
సత్తి చుమ్మా. దానికేసిసూడ గలవురా మరి?

అర్జు—

ఉ. పందిని గోరి వచ్చితివి పంతము లాడెద వేల యిట్లు నీ
సందడి చెల్ల దిచ్చట నిషాదకులాధమ! వేగ నీవు నీ
పందిని గొంచు నీదుపరివారముతోఁ జను మింక నేనునుం
దొందర సేఁగు దు న్మహిరథుం గొలువం దఱి మించకుండఁగన్.

కిరాతు—పం దోడికి గావాలనా యెరోడా? నాకు పంతమే సెల్లాలె
నామాట గత్తరై పోనాది. నాపెంటిముంగ లే నాబుర్ర కొట్టేసి
నావా షరోటా? నానే కొట్టేన నొప్పికొంతే సా లెల్లి పో తా.

అర్జు—అట్టిపౌరుషహీనం బగుపలు కొక్కనాఁటికి నానోట రాదు.

కిరాతు—అయితే కయ్యానికే దిగుతా? చరే. చూదావు గాని
తమాసా.

అర్జు—ఓరీ! కోరి చావుఁ దెచ్చుకొనుచున్నావు సుమా.

కిరాతు—నాయ న్నాయన! సంపేకుమా, నాపిళ్ళాని కొక్కణ్ణే.

అర్జు—ఏల యీవాగ్వాదము? చూడు మదె మార్తాండుండు నభోమ
ధ్యం బలంకరించె. నాకుం దడ వయ్యెఁ బొమ్ము. నయమునఁ
జెప్పితి విను—

కిరాతు—ఓ హోయి లింగపూజకా? దొంగపూజకా, కాకుంతే
పూజ సేస్కునే వోడికి క త్తేల పొదులేల? అమ్ము లేల? యి

యిల్లేల! మేకపెంటికల్లాంటి ప్రానలదండ తిప్పతా కూకోవాల గానీ !

అర్జు—ఛీ! నోరు మూయుము.

ఉ. కమ్మినక్రొవ్వుపేర్మి నిటు కయ్యముఁ గల్పనఁ జేయు నీదు శీ
ర్షమ్మిఁకఁ గూల నేసెద నిశాతశిలీముఖ మొక్క టేసి న
జ్జమ్మిది చూడు కార్ముక మొకమ్మరు నబ్బకుఁ బుట్టితేని రం
రమ్ము శరాన మెత్తఁ గదరా! శబరా! పలుమాటు లేలరా?

కిరాతు—(నవ్వి) నా నొకఅమ్మకు అబ్బకూ పుట్టే నేను నువ్వు పుట్టే వుగానీ, అట్టిమా టాడతావు. మీరెండి నాపెంటిముంగలే బాణాలు తిప్పదాం. యెవుడు గెలిస్తే ఆడే పందిని గొట్టినట్టు. చరేనా ?

కిరాతబంటు—సామీ! నా నుంతే నీ కెం దీకట్టం? (అర్జునునకు) ఓరీ నన్ను గెల్చుకొందూ సాలు. సామైతే నంపేస్తాడు. మా మొర కోడు. రామరి.

కిరాతు—నీకు తెల్దు, నీ వుంజెస్ని సస్తావు ఆ జేటనుకొన్నావా ? దొంగ బలే టక్కర్ బద్దరం.

కి—బం—ఏటి సామీ ! ఈసుద్దె యీడితాతల్లాటోళ్ళకి కత్తులు గిత్తులు నోళ్ళకే కత్తి నాలకో లొక్క టేసి వొక్కపాలే ముగ్గురు కాళ్ళ కొట్టడేశా యీ డం టెంత ?

కిరాతు—అదీ వొకయిశిత్తరమే ? కాళ్ళకొట్టదా మేంటోరి ? పీక లెగిరి పోవాల గానీ.

కి—బం—పీక ల్నేవు సామీ ఓడు కోసేసి నాడో. నేనుంతే నా—

కిరాతు—చబాస్, మాగొప్పోడివి బై లెల్లేవు. శబాస్క కొట్టేవు. యీడు నచ్చినపందిం గొట్టాడు ఎవడు గోప్పోడారి ?

కి-బం — నాను సామే, నాసు. మనుసుల్కి కొట్టేనే.

అర్జు — వనచరాధమా ! నీ కింక యముఁడానన్నుం డయ్యె రా రమ్ము.

కిరాతు — యెముడా ? రమ్మరు సూతాం నా నెముడి కెము ణ్ణనుకో.

అర్జు — (తనలో) అకటా ! నాసియనుమున కంత రాయము కల్గెనే.

కిరాతు — ఏ టాలోశిత్తున్నావు పెద్దతాటిసెట్టంత యిల్లొట్టుకోని బెదురుతా నేటి రా.

అర్జు — న్యాశివార్చన కాలస్య మైన దని చింతింతు. అంతె కాని నీతోఁ బోరన నెంత రా భిల్లా ?

కిరాతు — నీవ్రా జేడ బో తాది ను వ్వేడ బో తావు ? కసింతాల్చె మై తేంలే ?

అర్జు — నాతోఁ బోగ నీ కంత వేడుకా ? భుజములతీట తీఱును, రా.

కిరాతు — నాకేంసర్దా అనుకున్నావేంటి ? ఇది నాపెంటినర్దా. జగడాలంతె మరి నేదు. మాచెడ్డేదుక. మ రెం దాల్చెం ?

అర్జు — (ధనుష్టంకారముఁ జేసి) యీగాండివధ్వని వినినంత గుండె లవియునురా నీకు ఇఁక నైనఁ జావుఁ దప్పి పొమ్ము.

కిరాతు — మాసింత శెట్టుమీాద తేం ట్లీలాగే జుంయి మంతాయి నీగాండియ మెక్కు వేంటారి? ముండాసం తొచ్చింది. నీ కేం తెల్చుని దిను, ఓంకారిస్తాది. (గుణధ్వనిఁ జేయును.)

అర్జు — మూర్ఖా ! వాగుఁ జేల ? కాచుకో (బాణ మేయును) (కిరాతుడును బాణ మేయును. కొంతసేపు బాణయుద్ధము సాగును. తూణీరముల బాణములు లేక పోగా) ఏమియాశ్చర్యము!

గీ. ఖాండవంబుదహించెడికాలమందు
జాతవేదుం డొసంగునక్షయశరధులు
శరవిహీనంబులై యింక శరధు లట్టు
లచ్చెరువుఁ గూర్చె నాకు నియ్యదనునందు.

(నివ్వెర పడును)

కిరాతు—(భార్యకు) పెంటీ! ఆడిపని సరి. (అర్జునునకు) ఇం కైందా?

అర్జు—ఇదె చచ్చితివి. (గాండీవముతో మోదును. అది మాయ మగును (తనలో) ఏ మిది! గాండీవ మే మయ్యె! కానిమ్ము (ప్రకా) ఇఁక నీ ఖడ్గ ప్రహారముం గాచి కొమ్ము (ఖడ్గ మెత్తి కొట్టును.) అదియును మాయమగును. (తనలో) అయ్యో! నా బాహుపరాక్రమ మిట్లు వ్యర్థ మయ్యె! ఈనగరాజంబు దైవ నివాసంబు గాన నితఁడు ప్రచ్ఛన్నరూపుం డగుదివ్యపురుషుండు గాఁ దోఁచెడిని. మీఁద మీఁద వీఁడు పరాజితుఁడు కాఁడు.

కిరాతు—ఇంకేం టాలోసం? గుడ్లు మిటకరిస్తేంటి లాబం? వోడి పోనావా? వొప్పి కొంటావా?

(కిరాతునిపై వైవ నర్జునుఁడు వృక్షములఁ బెఱుకఁ బోవును.)

(తనలో) వీని కించుక నాదివ్యరూపంబుఁ బ్రసాదింతు.

అర్జు—దండకము. శ్రీమన్మహాదేవ దేవాదిదేవాధిదేవా! త్రిలోకేశ సర్వజ్ఞ యోగీంద్రహృత్పద్మలగ్నద్విరేఫా నిరాకార నిర్ణిద్ర నిర్లేప యోంకారమూర్తీ గిరీశా మహాపాతకోపద్రవోద్రేక నిర్మూలనప్రౌఢశక్తీ! విరించ్యాదికీటాంతజంతువ్రజంబుల్మనం ధ్యానముం జేసిన న్భక్తి వేగం గటాక్షించి రక్షింతు వీ వెంత దాక్షిణ్య వంతుండవో! జ్ఞానరూపంబునన్ జ్ఞాతృరూపంబునన్ జ్ఞేయరూపంబున న్విశ్వ మీరీతిగా నిండి వెల్గొందునిన్నుం బ్రి

శంసింప నే నెంతవాఁడరా........(దివ్యదృష్టి మాన్పును.)
ఓరీ ! రా రమ్ము, కాఁచికొమ్ము, (అర్జునుఁడు చెట్ల పెకలించి విసరును. అవి పూలమాలలై కిరాతునిమెడలోఁ బడును. అర్జునుఁడు బాల రువ్వును. అవి కిరాతుని శిరసున నలంకరించును.)

అర్జు—(ఆశ్చర్యపడును.)

కిరా—పోరా వోడిపో నావు. (వెనుకకు దిరిగి పోఁ బోవును.)

అర్జు— గీ. వెనుక మెలమెల్ల సాగెడిపిఱికిపంద!
నిందుమగవాఁడవే? నీవు నిలువు నిలువు
ముష్టిఘాతంబునన్ రెండుముక్కలు తల
యగు నటులు మోఁదుదు న్నిన్ను మగుడు మింక.

కిరాతు—(మఱలి) అద్దదీ పగ్గె- నాను సకమైనా మొగోణ్ణె. కాని మొగోడూ కాక ఆడదాయీ కాక అటు కిటికీ తప్పేనీలాం టోణ్ణి గాను లే.

అర్జు—ఛీ! తుంటా! (కలియఁ బడి ముష్టియుద్ధముఁ జేయుదురు.) అర్జునుఁడు కిరాతునివక్షమున గాఢముగాఁ గొట్టును.)

కిరాతు—(తనలో) ఏమినీనిభుజబలము! నన్నే యిట్లు కటకటఁబెట్టువాఁడే! (అర్జునుని గాఢముగాఁ గొట్టును.) (ఆతఁడు వెనుకకొరగును.) (ప్రకా) నానత్తువ తెల్సిందా? నా నోరనుకొన్నావు? యీసుమణ్ని.

అర్జు—అవును వనచరేశ్వరుఁడవు. (ఈశ్వరుఁడు దివ్యరూపముఁ జూపును.)

దండకము.

ఈవే జగం బెల్లఁ బాలించుచున్ గుక్షిలో నెన్ని యో లోకముల్దాఁచి రక్షించుచున్నావు నీలీల నేలీల నెవ్వానికిం గోచరంబౌను? నన్నేగటాక్షింపవే యభ్రగంగాధరా! యర్ధనారీ

శ్వరా! భక్తమందార! నీపాదరాజీవము ల్నమ్మినాఁడఁ గృపా సింధు నన్బ్రోవ రావే నమ స్తే నమ స్తే నమః (దివ్యరూపము జూన్పి.)

కిరాతు—నానోర్ణె తెల్సిందా? వోడిపోనావా?

అర్జు—నీవు— (పార్వతీపరమేశ్వరులు సాక్షాత్కరింతురు.)

గీ. భక్తపరతంత్ర పన్నగాభరణ నిన్నుఁ
గొండబోయుండ వంచు నుద్దండరీతి
గాండివమునను ముష్టిప్రఘాతమునను
గాసి వెట్టితి మన్నించి కావు నన్ను.

ఈశ్వ—నీభుజశౌర్యమునకు మెచ్చితిమి. వర మొంకు కోరుకొనుము.

అర్జు—మోక్ష మిచ్చి ప్రోవరే!

పార్వ—మమ్ము దర్శించినంత నీతపః కారణము మఱచితే?

అర్జు—తల్లీ! ఈదీనుం గనికరింతు రేని పాశుపతదివ్యాస్త్రంబుం బ్రసాదింపుఁడు. దానం దైత్య యక్షరాక్షసపిశాచోరగంబుల నతివీరు లైనభీష్మద్రోణాదివీరుల జయించి సహజకవచకుండలుండగు కర్ణుని వధింతు జీవితాంతమున గైవల్య మనుగ్రహింపుఁడు.

ఈశ్వ—ధనంజయా! సాయుజ్యసామ్రాజ్యం బీజన్మంబున నీకు లభింపదు. మంత్రధ్యానజపహోమాద్యుపదేశపూర్వకంబుగా సంధాన మోక్షణోపసంహారవిధానసహితంబుగఁ బాశుపతాస్త్రంబుం బ్రసాదింతు రమ్ము. (ఉపదేశించును) దీనం బగతురం గెల్చి మించెదవు.

అర్జు—నాకుఁ గైవల్యప్రాప్తి లేదా?

ఈశ్వ—గీ. పాశుపతమునఁ జేసెదు బంధువధను
దానమ్మృగయుఁడవై రయికరాన నాడు
రూవ మాదివ్యలింగంబు ప్రాపుఁ గాంచి
కలియుగంబున నీవు న ర్గలియఁ గలవు.

పార్వ—నీఖడ్గము, గాండీవము, నక్షయతూణీరములు మఱలఁ బడయుదువు.

అర్జు—మహాప్రసాదము !

ప్రమథుఁడు
లేకకిరాతబంటు } —క. మంగళములు దేవులకును
మంగళములు పారిషద్యమణులకు నెల్లన్
మంగళము పాశుపతమున
సంగరమునఁ గల్గునవ్యసాచికి మిగులన్.
(నిష్క్రమింతురు.)

---

## 2 రంగము. కైలాసము.

(పార్వతీపరమేశ్వరులు ప్రవేశింతురు.)

పార్వతి—దేవ ! కురుపాండవమహాసంగ్రామంబున నీచేఁ బాశుపతాస్త్రదానప్రసాదితుండై విజయుం డయి మించి కీర్తికాయుండైనవిజయుం డీయుగంబున బునర్జన్మ మందెనే?

ఈశ్వరుఁడు—ఎఱుఁగవే ? వాఁ డిప్పుడు షోడశవర్షప్రాయుండై వనంబున మహాజవంబునం బాఱుకురంగంబులను నింగి నిచ్చమై మెగయువిహంగంబులను గుఱితప్పక నొంటిబాణంబునం బడం గొట్టునేర్పుఁ గలమృగయుండై యెల్లర కల్లారుముద్దుగాఁ బెఱుంగుచున్నాఁడు.

పార్వ—ఎచటనో ?

ఈశ్వ—

ఉ. పొత్తపినాఁటిలో విపినభూముల నేలెడునాథనాథునా
నుత్తమబోయఱేని కుడుమూరనుపట్టణమందు తండ్రియ
న్నిత్తరియందుఁ గవ్వడి జనించి పెఱిఁగెడిఁ దిన్నఁడంచు నే
నిత్తఱి వానిబత్తిని బరీక్షను జేసెద మోహ మిచ్చెదన్.

నీవును జూచెదవు గదా ? రమ్ము.

(నిష్క్రమింతురు)

(జవనిక దిగును.)

ఇది చతుర్థాంకము.






# శివలీల

పంచమాంకము. తిన్ననిసాయుజ్యము.



1 రంగము కాళహస్తిసమీపారణ్యము.

తిన్నఁడు నిద్రించుచుండును.

తిన్నఁడు—(పలవరించును.) నా నోస్తా నుఁడు మంతే? పో అయితే నీ యన్నీ బూటకాలే. (వేఁటసందడి వినవచ్చును. తిన్నఁడు మేల్కాంచి) ఎంతసేపటి కొస్తన్నారొ మొదవలు! (ఏదుపంది ఘుర్ఘురధ్వనితో మహావేగమునఁ బాఱును.)

అవా! యేటి దాని తుల్లు! ఆనాకొండలికి డొంకిగొట్టి వుడాం యేసీసింది. అంత గోలాటసేస్తే దొరుకుతాదీ? నవట పీన్గులు! యెన్కమాటు సెల్లి నానొక్కదెబ్బ కొట్టేస్తా. (పరువెత్తి) అరెరే! యేటీ యిశిత్తరం! ఇందా కొచ్చి పంది మాయమై పోనాదీ! గమ్మత్తుగుందే! (అందందు వెదకి దివ్యలింగంబుఁ గని) ఇ దెంది? ఓవా! యిందా కక్కడోటు నానుకునుతా వుంతే కల్లో వోగి నా కనిపించి సెప్పినా డిదే గావాల! నిబ్బగే! సత్తెమే! (నేల సాష్టాంగపడి లేచి) నువ్వే నాపానలింగం! కనికారించి వోగి నాకొచ్చి కల్లో సెప్పినావు. ముళ్ళపంది నంపిక్కడోటుకు తెచ్చుకున్నావు నన్ను.

కాకపో తేది వంది? నీదయ, నిన్నుమరొగ్గను గందా! సామీ యెందీలా పారొచ్చినావు? యావ్వూరితమ్ముళ్ళతో తగువాడినా వేంటి యీాడ దాగున్నావు? బయ్యం నేదు. నాకాసింత సెప్దా. ఆళ్ళుడొక్క లీస్తేస్తా నే టనుకున్నావో నీపిల్లా లల్లరి కోర్సుకో నేక పారొచ్చినావు గావాల. అది మాగొ ప్పశిక్కు చుమా నిబ్బగా. నాకు బాగా తెలుసు. మాయ మ్మ యారాళ్ళతో దినామూ జగడా లాడతాది. ఆలంద రెల్లి మానాయనపాగాలు తినేస్తారు. ఆకు నీనాగే పానం బీజారై "సావండి ముండల్లాలా" అని మానాలు నానాలు కనబడ కంతా దాగుతుంతాను—జడ లొట్టు కొల్లా, వొ ళ్ళొట్టు గొల్లా నిన్ను పీకేసినారు గావాల?—నేను నేదు నీకు తిక్కత్తింది. కాకపోతే వొచ్చినోడి విక్కడో టుడియి లోనంతావా? (తనలో) బయ్యం సెప్పి మెల్లిక మావ్వూరు తీస్కెల్తా. (పకా) యి డడియిచుమా. పుల్లు, సింగాలు ని న్నిడ్సుకు పోతాయి, బద్దరం. మావ్వూర్కి నాయెం టెల్లి పో రా. నా నుంతే నీ కేంబయ్యెం నేదు. యిక్క డోలు నీకు దిక్కేంటి, ముక్కేంటి? ఆకర లేస్తే కూ డెవ డెస్తాడు? దప్పి కైతే నీ ళ్ళొ డొస్తాడు?—నే, నెగు మటి. (గద్దించును) మా గుండె నిబ్బరాం; మా టాడ్డు. (తనలో) మెల్లికబులా లేస్తా నింక. (పకా) మావ్వుడుమూ రొచ్చినావంతే నా? మంచి పాక కట్టిస్తాను. నీకేంగావా లంతే యన్నీ తెప్పిస్తా. పాలు కావాలా? మేకపాలు యెనుంపాలు, సవరపాలు, తేనో? పుట్ట తేన పెరతేన, తొర్రితేన, పానకాలంతావా? యీతకల్లు తాటికల్లు, యిప్పకల్లు, మాంస మంతేనో? పొట్టేల్మాంసం, నేడిమాంసం పందిమాంసం అది కాసింత తింతే మరొగ్గుతా?

యిక్కడుంతే నీపని పస్తే—యింకా నేరడిపళ్ళు, తాటిపళ్ళు, దోసపళ్ళు—వొక్కటే మాట. నీ కేంగావాలంతె యయన్నీ మామే తెచ్చి కుప్పలు కుప్పలు పడేస్తాం నీకాడ యే మన కొన్నావో? నీమనుసు కొచ్చిన దిస్తాం చరా యింకోటి (మెల్లగా) మామొరకలోళ్ళపనుసుపిల్ల లిన్నిస్తాలే. ఆళ్ళు నీకావ శేస్తే గుమ్మయి పోతానే మెరోద్దా గా. మరి యీ డేంటి? (విచారముతో) రా డెందీ? నా నేం శేత్తును?—పోనీ, నీ కిట్టం నేకపోతే. నీకు గస్సెడతానా? నానూ యిక్కడోటె వుంతా! మాటాడ్డేనాగ? పాపం యెన్నాలనుంచీనాగ మాడ తున్నాడో యిక్కడోటు! పానం కడొట్టిపోనాది గావాల. శిటికెలో యింటి కెల్లి యీదేన తెచ్చెడతా. (పరుగెత్తి పోయి మూకుటితో మాంసము గిన్నెతో గంజియుఁ దీసికొని వచ్చి) బేబేగిద యీకరకుట్లు రొండుతినీ గెంజి తాగు. పానం లేచొస్తాది. ఆయెన్క నడిచొద్దువు గాని, (నోటివద్దఁ బెట్టి) (తనలో) తినడేమీ?—(పైకి) యేటి నీమోరకం గుడ్లెక్కొస్తాంతే? నా న్నిన్న కొట్టినగున్నపందిమాంసం చుమ్మా! మాసక్కంగ కాల్సించి మాయుమ్మ, తిస్తా స్తే మ రొగ్గవు. మాయుమ్మ కంచుకా డెట్టకు తింతావుంతె బేగి లాక్కొనా. నీకంటెక్కు వేంటి?, (ఒకముక్కఁ గొఱికి) సీ! యిదీ యోడ కొంచెం మాడిం దిదొద్దు—(వేఱొకటిఁ గొఱికి చంకలు వైచి) బలె! యి దెంతకమ్మగుందో తిను. తిను. ఆబ్బెమొంది?— తినకపోతే నగ నేవుచుమా, నామా టినువ్వినా గాకల్తో పస్తుంతె నా నిస్తింతానా? తింతెనే తిన్నావు నేకపోతే యీబాణంతో పొడుసుకు నస్తా నీడ (పొడుచుకొనఁబోవును.) లింగము నోరు తెఱచును. తిన్నఁడు నోట మాంసముఁ బెట్టును. గంజిఁ

దాగ్రిగించును.) మాప్రారు గాప్రా ? నడ నేకపోతే మొత్తుకొంతాలే (ఎత్తుకొనఁ బోయి) ఉస్, రాము పో నియ్యి యిక్కడో లెవుండు. రోజూ నా నొచ్చి సూస్తావుంతాలే (పువ్వులతోఁ బూజించి నమస్కరించి పోవును. మఱియొకనాఁడు పుక్కిటఁ గల్లుఁ బట్టి, యొకచేత మాంసము రెండవచేతఁ బువ్వులు నెత్తిపై మారేడుదళములు మెడలో ధనస్సు మూపున నమ్ములపొదియు నుంచుకొని వచ్చి కాలిచెప్పుతో నిర్మాల్యముఁ దొలఁగఁ దోచి కల్లుమిసి యభిషేకించి పూలఁ జల్లి దళములం దులిపి, మాంసముఁ బెట్టును. దేవుఁడు మాంసముఁ దినకున్న) యియ్యాల దినవేం సామీ? ఆకల్లేదా ? కరకుట్లు కాల్లేదా ? (కొంతకి) బాగున్నాయే ? నామీఁద కోపం వొచ్చిందా ? ఆల్చెం శెయ్యి నేదే? చరిగ్గా యీల కొచ్చినానే? యీటో మణుచులో నుంచుకోని కూకుంకే నాకెలా తెలుస్తాది? శెప్పు మరి. కడుపు నొప్పో తల నొప్పో యిదని సొట్టంగా శెప్పు. నాను తెలనోణ్ణి గందా. యీంవో ఘుట్టికారణ ఉండాల (లింగమును దగ్గఱగాఁ జూచి) అమ్మ నాతండీ! యేడుస్తా వెంది? ఏ మొచ్చింది నాయనా యీనాడూ నేంది యీ తేంటే కంటెంట నీలు? కనికారం నేకంత మూడూళ్ళు గాల్శేశినావంతే. అప్పు డేడిశినావా? మరమద్దుణ్ణి బూడిద శేశినాడే నాకంట తడెట్టేవా? కల్లుకుండలో దొరికిపోతప్పుడు బయ్యమే సేడిసినావా ? యియ్యాల మాత్రంగా మొగదేడవడాం? నానుంతె నీ కేంబయ్యెం ? పల్లకో పల్లకో. ఓరి నా సూస్తె నవ్వుతారు. నాదేము దేడుస్తున్నా డంతె నాకు బురి కొట్టేసినట్టే. నాపగువు నిలబెట్టు నీవున్న మంటాది. వాకేం "పిల్లాల్కి పిల్లల్కి వాగ్గేశి యిడిసియాపాలయిపోనా నేం దాగి" అని శేసుస్తావో? అల్లిబాధ

పడనేర పారొచ్చావుగదా కొన్నాలాలకి తలవకు, ఆల్లకి బుద్దొస్తాది. బెట్టు శెడ సీకు మరి. ఆకలి కడుపు మాడతా వుందేటి? పురుగూ గిరుగూ కుట్టనేదు గందా? బేగి శెప్పు. మందో మాకో సూసుకొంటాను. దాసుకొంతే మట్టుకొస్తాది చుపూ దెయ్యం సోకింద గావాల? నువ్వు కన్నిప్పి సూస్తె అన్నీ మాయం అయిపోతాయే? (తనలో) దెబ్బకి దెయ్యం యెగిరిపోవాలి. (కాలిచెప్పుతో మోదును) యేటీనాగ పుట్టెణ్ణేల కేడుస్తన్నావు? వూరకో నాయనా, వూరకో నాతండ్రీ, కొంచె మోన్చుకో. (కౌఁగిలించుకొని వాఁడిలఁ గన్నులఁ బరీక్షించి, తనలో) యేటి నాతెలియు! వొకకన్నె నీలు గారతావుంది. నలు సొదో పడ్డాది గావాల? (గోచికొంగు పొత్తిఁ జేసి ఆవిపట్టించి కన్నొత్తును. గుడ్డుపై నాలుకచే నాకి తుడుచును. చేతు లొండొంటి రాచి వేడిచే గాచును. గ్రుడ్డుమూలల నొక్కుచు) యేటీజం! యిటేపు నొక్కి తటు, అటేపు నొక్కి తిటు వరదై పోతావుంది. కన్నుపాడై పోనాదేందారి నాకు? (మరలఁ గన్ను నొక్కి రక్తము కారుటఁ జూచి గుండె మోదుకొని యెలుఁగెత్తి యేడ్చుచు) యిదాదో కంటిరోగం గాని మరికోటి గాదు. కోడి రెప్పో పెరిగిందో, పారే కప్పేసిందో, మాదరోగ మో? యీయాడిగ్గుడిశెలో నువ్వు తొందరపడ్డావో దోసించింది గావాల? నా నేమ్నందు లెరగను. వూళ్లో కెల్లి యాదేనా తెత్తానుండు. కాసింత వోర్చుకో. (పరుగెత్తి పోయి మఱలి వచ్చి పసరులు పిండి పట్టువేయును. రక్తపాత మెక్కువగుట జూచి) సామీ యిదేంటీ కరమం? నాకు మరేం బుద్ది వోదు (ఆలోచించి) నీకం టెక్కువేంటి నాకు. నువ్వు బాగుంతె నాకంతే శాన.

నాకన్నిచ్చేస్తా సూడు. ముల్లు గుచ్చుకుంతె ముల్లుతోనే నాగుతాం. కంటికి కన్నే మందు. (కోలతో గ్రుడ్డుబెఱికి కొని లింగమునకుఁ బెట్టును. రక్తమాగును.) అద్దదీ వవ్వా! మామంచి మందేసినా నానుంతే నీకేంఫరవా నేదు. ఎంత బాగున్నా విప్పుడు! (అపరమితానందమున మఱల లింగముం జూచి రెండవకంట రక్తముగారుటఁ జూచి) ఇదేటి మల్లీ? అది బాగైతే దీని కొచ్చినా దిరోగం? కానీ, బయ్యం నేదు. దీని కదే మందు. నాకింకో కన్నుందిలే. (తనచెప్పుఁ గాలు లింగముకన్నుఁ దన్ని పట్టి కోలచేఁ దనకన్నూడఁ దీయు చున్న తిన్నని కీశ్వరుఁడు ప్రత్యక్షమై వానిచేయిఁ బట్టుకొనును.)

తిన్నఁడు—(కోపముతో) మెవుడా? నీవు? నాచె య్యొగ్గెయి. (విదల్చుకొనును.)

ఈశ్వ—తిన్నా! మెచ్చితి నీదృఢభక్తి ప్రసన్నుఁడనైతి. (మఱల వాని కన్ను నిచ్చును.)

తిన్న—(చేతులు జోడించి నమస్కరించి) నీదయ వొచ్చింది సామీ. (సాష్టాంగపడి తనసంతోషము ననేకవిధముల వెల్లడిఁ జేయును.)

ఈశ్వ—బాహ్యాడంబరములు లేక నిర్వ్యాజప్రేమతోఁ గూడినభక్తి యవినాభావమున నానందపారవశ్యమున మునుంగునీయట్టిభక్తు నెందుం గాన నీ కేమి కావలయునో కోరుకొ మ్మిచ్చెద.

తిన్నఁడు—ను వ్వేటిస్తావు నా కిక్కడోటు. నా న్నీ కియ్యాలి గానీ? నీ కేం పలుకుబడుం దీడ? నీకేం గావాలో అడుక్కో, నా నైచ్చిస్తా. (నవ్వును.)

ఈశ్వ—తిన్నా! నీ వెఱుగవు. నేను నీదేవుని గానా?

తిన్న—నాపానమే నువ్వు.

ఈశ్వ—వర మేదేని కోరుము.

తిన్న—నా కేలవరదు?

ఈశ్వ—(తనలో) మూర్ఖభక్తి తప్ప వేఱేఱుఁగడు. (ప్రకా) కోరికఁ గోరికొమ్ము.

తిన్న—నా కేకో రొద్దు.

ఈశ్వ—అది కాదు నీ కేమి గావలె!

తిన్న—నా కేంగావాల? కూడు నేదా, గుడ్డనేదా, చేతిలో యిద్దె నేదా? (విల్లు జూపును) నాకన్న నానునడగ కంతా యిచ్చేసినావు గదా?

ఈశ్వ— మఱేదే నడుగుము.

తిన్న—యీ టడగడామో యెల్లా గడగడామో యేటో నా కేం తెల్సు. నీయిట్టమొచ్చింది శేస్కో నా నొద్దన్న. నానే నువ్వు. నువ్వే నాను నా న్ని న్నొగ్గను. నీమఱుచు.

ఈశ్వ—(తనలో) వీని కించుకఁ బూర్వజ్ఞాన మిచ్చెద.

తిన్నఁడు—దేవదేవా! ఇన్నినాళ్ళకు నాపై ననుగ్రహమ్ము వచ్చినదే? (పునఃపునఃప్రణామంబు లాచరించును.) ఇఁక నైన నాకు సాయుజ్య మనుగ్రహింపవే.

గీ. శ్రుతిశిరోరత్న మానిన్ను శ్రుతివిరుద్ధ
గతిని సేవించి యారీతిఁ గన్నులిచ్చి
బోయకన్నప్ప నగునాదు మూఢభక్తి
తనరుగావుత నాచంద్రతారకముగ!

ఈశ్వ—తథాస్తు. రా రమ్ము. న న్గలియుము. (చేతులఁ జాపును. తిన్నఁడు అనఁగా కన్నప్ప లింగైక్య మగును.)

(జవనిక దిగును.)

సూత్రి— కం. మంగళములు మంగళములు
మంగళములు సభ్యులకును మాన్యుల కెల్లన్
మంగళములు జగతికి మా
రంగమునకు మంగళము తిరం బగుఁ గాతన్.

ఇది పంచమాంకము

సంపూర్ణము



ాందిలో:—

కాంచినభక్తులు=దర్శనముచేసి సేవించిన భక్తులని యర్థవ
ుట సీమంతిని యనఁ బార్వతిం జెప్పకొనునది. ఎంచి=ప్రశంసిం
ినఁగాఁ బార్థునిం బ్రశంసించి యని యర్థము. ఇందు 22 పదముఁ
ర్థమువలనఁ గావ్యార్థసూచనము. చేయఁ బడినది. ఈనియమ మిప్ప
వారు పాటించుటలేదు. నాందీప్రస్తావనలే విడుచుచున్నారు. చింత్య

---

# శుద్ధపత్రము.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 6 | 13 | ఆదిమధ్యాంత | ఆదమధ్యాంత |
| 7 | 17 | నటులుజేసి | నటులుచేసి |
| ,, | 19 | మసీందురా! | మునీంద్రా! |
| 11 | 16 | లెల | కేల |
| 15 | 18 | కెల్ల | లెల్ల |
| ,, | 6 | నేసి | నేసి) |
| 17 | 19 | గన్పట్టి | గన్పట్టె |
| 21 | 1 | లింకనఁ | లింకిన్ఁ |
| 25 | 7 | కల్గెను | కల్గనే |
| 32 | 16 | మోాస | మాని |